# మణిమందిరము



కవయిత్రి.

శ్రీమతి మణిరామచంద్రరావు

శ్రీరస్తు

# మహిమమందిరము

అను పద్యకావ్యము



శ్రీమతి మణిరామచంద్రరావుగారిచే

రచియింపఁబడి

మామగారికిని, తండ్రిగారికిని

అంకిత మియ్యఁబడినది.

శాలి. శక. 1881 వికారి సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి

గురువారము




16-7-1959

వెల రు.

# తొలిపలుకు



మణిమందిరము అనగా మణియమ్మ నివసించు గృహమని యర్థము. అట్టిమణిమందిరానికి శ్రీ మహావిష్ణువును అతిథిగా పిల్చుటే కథానుక్రమము ఆ ప్రభువు సమస్త దేవతాబృందముతో కదలిరాగ. నాభావిత జనులకు చూపుటే నాయభిలాష ఈధైర్యమునకు నా అయిదేడుల బాల్యదశలో చూచిన శ్రీ మహావిష్ణు దర్శనమున్నూ, స్వప్నానుభవములున్ను తోడ్పడినవి. భాషాజ్ఞానములేనందు వలన నెన్నియో భావములు జీర్ణించిపోయినవి. మాటలవచ్చుచున్నబిడ్డ మధ్యమధ్య వదరి పైచిన పదములకు ప్రీతితో పెద్దవారు పూర్తియర్థము గ్రహించురీతి పండితవర్యులు నాభావములను పూర్తిగా అర్థముచేసి కొనగలరని ఆశిస్తున్నాను. మణిభావమణులు అను గ్రంథముయొక్క ఆవిష్కరణ సందర్భములో కవులు పాఠకులు నాకిచ్చిన ప్రోత్సాహమే యింత త్వరలో ఈకావ్యము చేయుటకు తోడ్పడినది. మరల అట్టిప్రోత్సాహమే నాకు లభించగలదని ఆశించుచు మీదీవనలం గోరు, అల్పభావాల

(ఆంధ్రసోదరి)

మణియమ్మ.

# విజ్ఞాపన

పండితవర్యులకు నమస్కరించి, అల్పభావాల ఆంధ్రసోదరి మణియమ్మ చేయు విజ్ఞప్తి భాషలో నేమాత్రము కృషిసల్పనినాకు, కేవల దైవికముగా కలిగిన, కవితానాహిని. కట్టజాలక వ్రాసెడు ఈ చిన్న మాటలలో దోషములున్న, తమ విజ్ఞానముతో సరిదిద్దుకొని, మెఱుగును పెట్టి గలరనియు, తమభావములు వ్రాసి ఈ మణిమందిరమను చిన్నగృహమును పెద్దసౌధముగా, అనగా (మణిమందిరమను చిన్నపొత్తమును మహాకావ్యముగా భావింపగలరనియు) మీవిజ్ఞానవాక్కులతో దీవించగలరనే కోరికతో ఇంవలివ్యాఖ్యత కవివర్యులకే వదలివేయుచున్నాను. నాపుట్టుక స్థలము తూర్పుగోదావరి జిల్లాలో రాజమహేంద్రవరము గాన నచ్చటి వాడుకభాష దీనియందెక్కువ కానుపించును. మీభాషాజ్ఞానము ముందు ఓనమాలను బోలు ఈ చిన్న పదములను చూచి హేళనచేయక చంటి బిడ్డ మాటలుగా నెంచి క్షమించఁగలందులకు వేడుచున్నాను

ఇట్లు
ఎల్లప్పుడు మీదీవనలకోరు,
అల్పభావాల ఆంధ్రసోదరి
మణియమ్మ.

# పండితాభిప్రాయములు

ఆస్థానకవి బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

శ్రీ ర స్తు.

## "మణీమందిరము"

★

ఇది మణియమ్మ వ్రాసి తన తండ్రిగారికిని మామగారికిని కృతియిచ్చిన గ్రంథమణి—"అల్పభావాల ఆంధ్రసోదరి మణియమ్మ" అని తొలిపలుకులో నామె వ్రాసికొనినది. గాని నాకమాత్రమట్లు కానిపించుటలేదు. మహాభావములెన్నో యిందు కానవచ్చుచున్నవి. "రమ్మురమ్మయ్య మణిమందిరానికనిన పలుకవేలయ్య? పరమాత్మ! పంతమేల?" అను మకుటముతో నానావిధములైన చక్కని భావములతో గ్రంథమంతయు వింతగా సాగించినది. అల్పభావములుగల దానవని వ్రాసికొనుట అహంభావనిరాకరణమే యనుట నిశ్చయము.

పూర్వకవులు తమగ్రంథములలో దేవుఁడు స్వప్నదర్శనమిచ్చి గ్రంథము కృతియిమ్మనినట్లు వ్రాయుట సత్యదూరమందురు. వారిమెస్వప్న వృత్తాంతములు విన్నచో నన్నియు నిజములేయని తోచకమానదు. ఈమెబాల్య

ముందుఁ దనతండ్రిపట్లఁ దానుజూపిన భావాతిశయము వర్ణనాతీతము విజ్ఞానప్రదుఁడుతండ్రి గావున నిటఁదల్లిం బేర్కొనమి దోషముగాఁబడదు. తనకు స్వాప్నానుభవమున నైనభావములు భాషాజ్ఞానములేనందున జీర్ణించిపోయినవని చెప్పుచు వానిని మాటలునేర్చుచున్నబిడ్డ నడుమ నడుమ విడిచిన పదములఁ బెద్దలు ప్రీతితోఁ బూర్తియర్థము గ్రహించినట్లు పండితవర్యులు నాభావములను బూర్తిగా నర్థముచేసికొనఁగలరని యూశించుచున్నాను. అనిచెప్పిన వాక్యమెంత గంభీరముగానున్నదో చిత్తగింపుడు.

ఈమె లోగడ "మణిభావమణులు అను గ్రంథము వ్రాసెనట! దానిపేరుంబట్టియె యది మణియని తెలయుచున్నది. ఇట్టినామములు తమ గ్రంథములకుం బెట్టియే మహాకవులు తమ మేధాశక్తిని బ్రకటించుకొందురు. మఱియు నీసతి తనబుట్టుక రాజమహేంద్రవరమున ననియు అక్కడివాడుకభాష నాభాష యనియు, ఓనమాలంబోలు నాయీచిన్ని పదములంజూచి హేళనముచేయక చంటిబిడ్డమాటలుగానెంచి క్షమింపువేడుచున్నా"ననియె. ఇందు రాజమహేంద్రవరభాషయనియు, ఓనమాలవంటి నామాటలనుటలో నెంతభావగాంభీర్యములున్ననో పండితులు గ్రహింపఁ

గలదు. రాజమహేంద్రవరమే భాషకుఁ బుట్టినిల్లు, ఓనమా లకే భక్తపండితలోకము బహువిధములఁ బాటుపడుచున్న దని తెలుపుచున్నాను.

ఈమె గ్రంథాదిని సరస్వతిస్తుతి చేసినది "రాత్రి మాయమ్మనుబోలి వచ్చితివి, ఎందుఁబోయితివి. నిన్నుఁ గని పెట్టుటకు నేను బమ్మెరపోతరాజునా? అన్నదహా! "తోడ బుట్టువు చందానఁ దోడనున్న గణపతయ్యకు నేనిప్డు గారె లిడుదు" ఇది గణపతిస్తుతి గారెలు తినుటకు తప్పకవచ్చు ననియే నామతి. ఓహో! కవులారా! మీరుగాని మీపూర్వులు గాని గణపతికిట్లు గారెలుపెట్టినారా? లేదు లేదు. ఇది యేక్రొత్త పోకడ!! మఱియును దేవతాస్తుతులన్నియు నేదో యొక క్రొత్తతనమును బోధించుచునేయున్నవి. చూడుడు చంద్ర వర్ణనము.

"బాలమనసుల నవ్వించుభాగ్యరాశి
భువిని వెన్నెలఁ గాయించు పుణ్యమూర్తి
మామలకుఁ దాతతండ్రులమామయైన
చందమామకుఁ గేల్మోడ్తు సంతసమున"

"బాలమనసుల నవ్వించు" అనఁగా తల్లి తన పిల్ల నెత్తుకొని దానికిఁ జందమామను జూపుచూ, చందమామ రావే! జాబిల్లిరావే! బువ్వఁదినిపోవే! ఇత్యాదులు పలికి

పిల్లను నవ్వించి చూపింతు రీవిషయమిట సూచితము లోక మున కంతకును మామ (పోషకుఁడు) గావునఁ జందమామ యని ముద్దులొలుకు సుద్ది. యిద్ది కాదందురా? ఎవ్వరనఁ గలరు? చెంచువాండ్రుం-లోనగు నాటవికులు భర్తను మామ యందురు. ఇఁక రాజమహేంద్రవర వర్ణనము చూడుడు.

రంగైన బంగారు రాజమండ్రి
రత్నాలపేటిక రాజమండ్రి
రమ్యరత్నాలుగలకొండ రాజమండ్రి

ఈ పదములెంతో ముద్దులుమూట గట్టుచున్నవి. ఈమె తన వంశమంతయు నొక్కపద్యమున తాత తాత మొదలుకొని తనవరకుం జెప్పినది. ఇట్లుచెప్పుట యసామాన్యమే. ఈలోఁద నతండ్రినెట్లు సంబోధించుచు నెట్లు రంజన చేసిననో! చదువుఁ డామోదజనకంబగు.

1 చందమామయ్యకథనాకుఁ జక్క చెప్పు
కన్నతండ్రికి నేనెప్డు కరముమోడ్తు

2 చుక్కలెప్పుడు పుట్టెనో సూర్యుఁడెట్లు
కొండమీదికి నెక్కెనో గోటుగాను

3 దేవుఁడెట్టులు పుట్టించె దేశమంత

4 భుజమునందు నన్నిడికొని బుజ్జగించి
భాగవతపద్యరత్నాలు పఠనచేసి
జోలపాడంగ నాకప్డు జోగురాఁగ
నిదురఁబుచ్చెడు నాన్నకె నిడుదునతులు॥

5 కాసులమ్మణి నాన్న! ఓకన్ననాన్న
చేతనత్తెడు నాన్నకే జేజలిడుదు॥

ఇట్లుముద్దులుమూట గట్టునట్లు తనకు నాన్నకుంగల ప్రేముడి కరుణారసంబు వెల్లివిరియుచున్నట్లు పెక్కుపద్యములు, పెక్కువిషయములం బేర్కొనుచు నిందువర్ణింపఁబడి నవి. అవి చదువువారి కానందబాష్పములు రాలకమానవు మఱియు తన బాల్యమెట్లు నడచినదో 30 దవ పద్యమందు చెప్పబడినది అదియొక్కటిచాలు సీమె పేర్మిం బేర్కొనుటకు తార్కాణ మగుచుండు, ౬౩ వ పద్యములో తండ్రిగారు తనకుఁ జెప్పిన కథలన్నియు నెన్నో తెన్నుల విన్నవించుట కెన్నవచ్చునని చెప్పుచున్నాను. మఱియు ననేకవిషయము లీ గ్రంథమందును పోద్ఘాతముగా మునుమున్ను విన్నవించి నది. ఇట్లు సామాన్యముగాఁ గవులు వ్రాయరు. ఈవ్రాతే బంగారుపూఁతయై గ్రంథమునకు మెఱుఁగు దెచ్చినది. తన మామగారినిందుఁ బేర్కొనుచు చెప్పిన 44 వ పద్యము హృద్యమందునో? జగదేకవేద్యమందునో? చెప్పఁజాల.

ఈమణిమందిర గ్రంథమునందు రమ్మురమ్మయ్యా మణి మందిరాని కన్న మకుటముతో సీసపద్యములు హృద్య ములుగాఁ జెప్పఁబడినవి. ప్రతిపద్యమందు నేదోయొక యపూర్వార్థవిశిష్టత్వముగాఁ బేర్కొనఁబడుచున్నది. కథలో 7 వ పద్యమున సంసారమను నెద్దుబండి నెక్కి బాటసారినై పోవుచుండఁగా క్రోధమను తోలుపులివచ్చి కాంక్షమనుచు సహనమను నాబండియెద్దును జంపఁజూడఁగా ఆయుధములు లేని దాన దానింగాపాడు దిక్కెవ్వని కలఁతపడుచుఁ గరుణింప రమ్మని నిన్నుఁ బ్రార్థింతు "రమ్మురమ్మయ్యా" ఇట్లు 100 పద్యములు ఏదో విశేష విషయముల వెల్లడించుచునే యున్నవి. మఱియు రెండు, మూడు పద్యములు 87 వ పద్యము "దేవుండవీవని కావరమ్మని పిలుచుటలేదు భారత స్త్రీలకుఁ బతిదైవముగాని యితరములమాట యేమిటికి? నిన్ను దైవముగాఁ గాక తండ్రిగాఁ బిల్తును. నన్ను తన యగా నెంచిరమ్ము అనిప్రాయుట యెంత విజ్ఞానమో పెద్ద లూహింతురుగాక.

90 వ పద్యము "మజ్జిగలో వెన్నయుంటనట్లు సంసార మందున్న దాననేను" కట్టెలో నగ్ని కానఁబడకుండునట్లు కాలంబు గడపుచుంటిని కులాలకీట న్యాయమున కుమారీ తక్ర నవనీతన్యాయము. కట్టెలో నగ్నియు నట్టిదే.

91 వ పద్యము :- భారత దేశములో భాగ్యవంతులు బిరుదుపట్టు బంటులు వేనవేలు వేదవేత్తలు పండిత ప్రకాండు లుండఁగా వీరిలో నేల్పురాలనైన యింతిని నేను నాయింటిలో [illegible] చేయ నీకెంత జిన్నతనమా? నీవు భక్తికి లొంగెడు బంధువైనచో శమ్మురమ్మమ్మ్యా! ఇట్లు గ్రంథమంతయు వ్రాయుటకు పండితులకుగాని సామాన్యులకు సాధ్యము కాదు. సామాన్య విద్య నేర్చిన యొక స్త్రీ యిట్లు వ్రాసినదనుచో నామె పూర్వజన్మ పుణ్యవాసన మంచిదనియు నామెకు స్వప్నద్వారమున నీశ్వర సాక్షాత్కారమగుచుండునని చెప్పనగుచున్నది.

ఇట్లు గొప్పవిశేష విశిష్టమైన యీ గ్రంథము చదివినప్పుడు నాకు పరమానంద మధికమగుటఁ జేసి యిందు నేవేని శబ్దార్థదోషములున్నవో లేవో విచారించుట కిష్టత లేకపోయినది. ఏవేని స్వల్పదోషములున్నచో చదువరులే సవరించుకొనవచ్చును. ఈగ్రంథమందవి చెఱకునకు వంకకొంతదోషమగునో అట్లేయై పరిగణింపఁ బడవని నాయభిప్రాయము పాఠకులెల్లరును దీనికిఁ బ్రాశస్త్యము గలిగించఁ గలుగుదురనియే నాయాశయము ఇట్టిగ్రంథము రచియించిన యీకవయిత్రీ మణికాయురారోగ్య భాగ్యసౌభాగ్యంబులు పరమేశ్వరుఁడు ప్రసాదించుగాకయని సర్వదా ప్రార్థించుచున్నాను.

రాజమండ్రి
20—6—59

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.
రాజమండ్రి ఆస్థానకవి

గీతాపండిట్ వేదాంతవిశారద,

ఉ. వే. శ్రీమాన్ కొండూరు కృష్ణమాచార్యులు

శ్రీమతి మణిరామచంద్రరావు. అను నీకవయిత్రీరత్న మునకు పూర్వపుణ్యావశమున బాల్యమాదిగా దేవతా పరిచయము దేవతాసాక్షాత్కారము స్వప్నానుభవములున్నట్లు ఈమణిమందిర పద్యములె తెలుపుచున్నవి. ఆచనవుచేత నే "తోడఁబుట్టువు చందానఁ దోడనున్న గణపతయ్యకు నేనిప్పుగా రెలిసుడు" ఇట్టిహాస్యోక్తులతో నిందాస్తుతులతో దేవతాస్తుతులు మొదలు కావ్యమున నక్కడక్కడ కొన్ని విషయములు వర్ణింపఁబడినవి. ఇట్లె లక్ష్మి సరస్వతుల యెడ న్యాయ నిష్ఠురోక్తులు ఇంద్రునియెడ చూపోపమితనము మన్మథునియెడ దౌష్ట్యము. వెల్లడింపఁబడినవి. అది జన సామాన్యమునకు దేవతానిందగాఁ దోచును. కాని అదియు నెక్కువ చనవుచేత నేయని యెఱుంగనగు కొన్ని పద్యముల యందు మీ దేవతలు మా భారతీయులు అనుసంఘభేదముల నేర్పఱచి తనకుగల దేశాభిమానమును వెల్లడించుటయు వారియందును తప్పుల గుర్తించుటయు గలదు మరియు స్వసంఘమందును "తనుజూడగాఁడైన త్రాగుబోతైనను సతికి నీతులుసెప్ప సాహసించు" అని తప్పులను నెత్తిచూపుటయు గలదు. ఈమె మోమోటమిలేని నిష్పక్షపాతినియగు కవయిత్రితిలకమనవచ్చు, ఇట్టి ధైర్యమునకు ఈమెసాధిం

కవి తనకు తోఁచినది వ్రాసి ప్రపంచములో పడ వేయును. విజ్ఞులు దానిని చదివిచూచి, జూచి, రసమలజాడఁ దెల్పుదురు. కథావస్తువు ఛంధశ్శాస్త్రము, వ్యాకరణము, అలంకారవిశేషములు కవితాగానమునకు ముఖ్యాంగములు. కాని యీశృంఖల విహారము భక్తి కనవసరము. భక్తి యన్నది ఈశ్వరుని స్వరూపము. పరమపవిత్రమైనది. దాని నవగాహన చేసికొని మననముచేసికొనుటయే అట్లుతరించుటచే మానవుని జీవిత పరమావధి. ఈరీతిననుసరించి జన్మ సార్థక్యముచేసికొన్న శ్రీమతి మణియమ్మను నేనెంతయు నభినందించుచున్నాను. ఈ సాత్వికలము ప్రసరించిన మణిమంది రాన పరమదయాపయోనిధియైన పరమాత్మ దేవుఁడధివసించి లోకకళ్యాణ మొనర్చుగాత!

మ॥ కృషిలోన స్వవితాకళన్సుఖబలో॥ దేకోద్ధతి స్వర్తకో
న్నిమప ధీచాతురి సంతతాభ్యుదయని॥ ర్ణిద్రస్థితిన్గన్న సం
తుషితస్వాంతులు మత్కులీనులు యశో॥ దుగ్ధాబ్ధి
రాకాసుధా
సుషమాపూర్ణుల వాక్ప్రసాదము శుభ॥ స్ఫూర్తిన్మణి
న్బ్రోచుతన్.

మకాం మదనపల్లి
28-6-59

ఇట్లు,
గో. వె. నరసింగరావు.

G. V. NARASINGA RAO M. A. B. L.,
R. D. O. Madanapalle

శ్రీమతి సుంకర మణియమ్మ రచించిన "మణిమందిరము" నామూలాగ్రముగఁ జూచితిని. కథావస్తువు కవయిత్రీ తీవ్రతపస్సు. ఆధ్యాత్మికావేదన. అసదృశవ్రతాఢ్యత. పరమవస్తు దర్శనార్థ ముఫ్విళ్ళులూరు మంజులాభిలాష చిత్తమీశ్వరాయత్తమైనపుడు, భక్తిపారవశ్యమైనపుడు, బ్రహ్మానంద పులకితమైనపు డయాచితముగ ననివార్యముగ, హఠాత్తుగ నిర్మల గంగాస్రవంతి వడువున హృదయమందిరము వెలువడు అమృత వాక్సందోహమే మణిమందిర నిర్మాణము.

ఈశ్వరస్వరూపమును సహస్రవిధముల సృష్టించి, దోహద మొనర్చి సుమడోలల నూఁగించి జోలలఁలాలించి, తన మణిమందిర ప్రాంగణమున కాహ్వానించి, సర్వస్వము దోఁచుకొమ్మని, దొరవునీవని, పాలించుకొమ్మని ప్రాధేయపడు పరమ భాగవతురాలి యావేదన మణిమందిర స్వరూపము.

సచ్చిదానందస్వరూపమును సంపూర్ణముగ మనోవీథి నధిష్ఠింపించి, మాటలచే నెఱుకలచే, మననములచే దరిఁజేరఁ గరాని శుచిననుష్టించి పుష్పాంజలితో మోకరించి, భవబంధ విమోచనకై నిరంతరకృషిసల్పి యల్లలాడు దీనురాలి దాసోహమే మణిమందిర ప్రవచనము.

తినే సాక్ష్యంబు" ఇత్యాదులచేత పాతివ్రత్యమునకుమించిన శక్తి లేదని ఈకలికాలమున నీసమయమున నిట్టిధైర్యముతో సాటించుటకు పైగుణపంచకమే యీయామె కీశక్తినొసంగినదని చెప్పకతప్పదు. పండితులకు సైతము శిరఃకంపనము గలిగించు నీలలితభావముల సులభములగు వాడుకమాటలో నిమిడ్చిన యీ పద్యరత్నములు ఈమెగారి పవిత్రతాసూత్రముచేతనే కూర్చబడినవి. ఈకావ్యము మేలిమి బంగారుతోఁ గట్టిన రత్నాభరణము వంటిది అనుట అతిశయోక్తికాదు. అది యెల్లరకు శిరోభూషణము కాకతప్పదు ఈకవయిత్రి కీశ్వరుఁ డాయురారోగ్య భాగ్యములను అనవద్యమగు విద్యను అనర్గళమగు కవితను ప్రసాదించుగాకయని ఆసర్వేశ్వరునే ప్రార్థించుచున్నాను.

గూ డూ డ
27-6-59

ఇట్లు,
కాం. కృ. ఆచార్య.

చిన పవిత్రతయే కారణము 34 పద్యములో "నామవి యందున నదివలెఁ బ్రవహించె వరపవిత్రత యను వరద యొకటి" అని పవిత్రతాశక్తి వర్ణింపఁ బడినది. మఱియు ప్రతిన అనుశీర్షికలో 61 వ పద్యమున గురువు దైవము దల్లి తండ్రి అను లోకోక్తుల తత్త్వార్థము వెల్లడింపఁ బడినది 61 పద్యమున 1 పవిత్రత, 2 పతిసేవ, 3 పాపభీతి 4 పరచింతన 5 పెద్దల యనుగ్రహము గలదానవైనచో నీవు వచ్చెదవు "రావదేనియు నిన్నింక రచ్చకీడ్చి పరువు దీతును. అని సాటినది. ఈ పంచామృతములె ఈమె ధైర్యము నింతగాఁ బోషించినవి. ఇట్టి భక్తురాలికి అమృత తుల్యములు అభినవములైన భావములావిర్భవించుటలో నాశ్చర్యమేమున్నది! త్యాగయ్యగారు "తరాన లేనిపరాకు" "ననుపాలింపనడచివచ్చితివో!" గగనానికిలకు బహుదూరం బనినాడో? అను నీభావరసగర్భితోక్తుల నెట్లువ్రాసిరి! భక్తి చేతనె ఆభక్తిలేని పండితులు కొండల పిండిచేసినట్లు ప్రచండములైన పదతండంబుల జోడించగలరు. కాని వారి కీరసో క్తులు రాగలవా? మణిమందిరము 82 వ పద్యములో అన సూయా పాతివ్రత్యమును వెల్లడించుచు "బుజ్జిపాపలఁజేసి జోజ్జనింపె" "మాతృమూర్తిగ నింతలోమరచినారె! అను కమ్మని పలుకులచేత లోకములోని మహిళామాతలకు ఉత్తేజ మొసంగినది. 35వ పద్యములో "సూర్యుని నిల్పిన సుమ

V. R. NARLA,
EDITOR

ANDHRA PRABHA,
MADRAS-2.

# " మ హి మం ది ర ము "

*

అప్రయత్న రచనలోని నిసర్గసౌంద ర్యాన్ని పుణికి పుచ్చుకొన్న ఈ కావ్యం రసజ్ఞలోకం హర్షామోదాలను సంపా దించుకొన గలదనడంలో సందేహంలేదు.

— నార్ల వెంకటేశ్వరరావు.
26–6–59

మణిమంచిరాహ్వాన శతకములోని పద్యమణుల నచ్చటచ్చట స్థాలీపులాకన్యాయముగఁ దిలకించు భాగ్యమబ్బి నందులకెంతయో సంతసించుచున్నాను. కవయిత్రిగారి స్వానుభూతియు లక్ష్మీసరస్వతులందుగల బద్ధానురాగ భక్త్యావేశాది పవిత్రభావ పరంపరలవ్యంగ్య వైభవ వైచిత్రియే యిందితివృత్తముగను రమణీయార్థ ప్రతిపాదకముగను, నిందాస్తుతులు, వక్రోక్తులు మొదలగు చమత్కార జనకమగు పౌరాణిక గాథా విమర్శనలతో నీశతక కావ్యమొక యపూర్వాలంకారమును మహిళామండలికీ కవయిత్రి వలెనే సమకూర్చుచున్నది. కవితాశైలి ధారాళమును, సరళముగను సులభముగనుండి బహుజనోపయుక్తముగ నున్నది. ఇట్టిగ్రంథములు విశ్వమానవ కల్యాణమును జేకూర్చునట్లును, సత్యధర్మాహింసలను బ్రోత్సహించునట్లును మఱికొన్ని వ్రాయుటకు శ్రీమతి మణిరామచంద్రరావు గారికి దీర్ఘాయురారోగ్యములు దైవము ప్రసాదించుగాక!

గూ డూ డ
10-5-59

G. విద్వాన్ రామకవి
1 గ్రేడ్ పండిట్
S. M. G. హైస్కూల్

శ్రీమతి సుంకర మణిరామచంద్రరావుగారు రచించిన "మణిమందిర" మను గ్రంథమును జూచితిని. ఈకవయిత్రి తనకు రమావాణులు సహచరులని యటనటఁ జెప్పికొనుట నిక్కమముగనే తోఁచుచున్నది. అదృష్టవిశేషమున నీబిడకు మంచిభావములు స్ఫురించినవి. ప్రతిపద్యమున నేదేనొక చమత్కృతి. నిందాస్తుతి పఠితలకు గోచరించును. మానవ కల్యాణమునకు పవిత్రతయే ప్రధానకారణమని యీగ్రంథము చాటుచున్నది.

ధారనిసర్గసరళమై పామరులకు సహిత మర్థావగతి గల్గించుననుట సహజోక్తి. పరమేశ్వరుఁ డాయురారోగ్యము లిచ్చి యింతకన్న మెఱుఁగైన కృతులీయమచే రచింపఁ జేయుఁగాక.

గూడూరు
10–5–59

కె. సి. జయచంద్రశాస్త్రి.
సాహిత్య విద్యాప్రవీణ సంస్కృత పండితుఁడు,
బోర్డు హైస్కూలు.

శ్రీమాన్ బి. రంగాచార్యులు,
శిరోమణి, విద్వాన్

B. H. School,
GUDUR, (Nellore)

శ్రీమతి S. మణిరామచంద్రరావుగారి కవితనవనవ భావలలితమని ఈమె రచించిన మణిభావమణులు అను గ్రంథమే చాటుచున్నది. ప్రకృతము సరళ సుందరమగు శైలితోడను, విరచితమైన నీ మణిమందిరమును సంపూర్ణముగఁ బఠించితిని. ఇందులోని కల్పనలు అపూర్వములు పూర్వజన్మ సుకృత పరిపాకముచే కవయిత్రికి లబ్ధమైనవిగాని సామాన్యుల కందరానివి. ఈ పొత్తమంతయు నిందాస్తుతులతోఁగూడి, భగవదాహ్వానరూపమై, భక్తిబంధురమై యలరారుచున్నది.

ఈ సాధ్వీమణి మున్ముందు భారతనారీ హృదయరంజకములగు రచనలఁజేయుచు ఉత్తమ కవయిత్రి కాఁగలదని విశ్వసింతును. శ్రీ మణియమ్మగారికి అందులకు వలయు సర్వశక్తిని ఆయురారోగ్యైశ్వర్యాదులను, ఈ మణిమందిరేశుఁడొసగుగాక.

గూడూరు
5–7–1959

ఇట్లు,
బి. రంగాచార్యులు.

శ్రీ పడాల రామమూర్తి
విద్వాన్
B. H. School

గూ డూ రు
10-7-59

చ॥ నినుగని పెంచి విద్యలను నేర్పినతండ్రికి వైద్యతల్లి జం
జని వినుతింగడించిన మహామతినీపతిఁ గన్నతండ్రికిన్
గొనబుగఁ గావ్యకన్యనిడి కూరిమివారి ఋణంబుఁదీర్చుకొం
చును ఘనపుణ్యయోగమున సూరులు మెచ్చఁగఁ
గీర్తినొందవే

మ॥ అకలంకస్థిరభక్తితోఁ జనవుతో నత్యంతసంప్రీతితోఁ
ప్రకటస్నేహభరమ్ముతో నలుకతోఁ వైకుంతులోకేశుఁ ద
ప్పక మాయింటికి రమ్మురమ్మనుచు నాహ్వానించు
నీహృద్య ప
ద్యకదంబంబుఁ బఠించుచో మదిని బ్రహ్మానంద
ముప్పొంగదే॥

కవయిత్రీమణీ! వెనుక మీ మణిభావమణులు అను గ్రంథముయొక్క ఆవిష్కరణసభలో క్షణక్షణ మభినవానందంబుఁ గలిగించు నాగ్రంథమందలి నూత్నభావములు నాచే నపుడే రెండు పద్యములఁ బలికించినవి వానినిఁగూడ నిటఁ బొందుపఱుచుచున్నాను.

మ॥ కవయిత్రీమణి! నీదు భావములఁ గావ్యంబు
వీక్షించితిన్
సవిమర్శంబుగ నేమిసెప్పఁదును యుష్మద్భావనానల్ప శ
క్తివచోధోరణి తీరు తీయముల జాతీయంబులింపొందగాఁ
శ్రవణానందమొనర్చుఁ దత్కృతి పవిత్రత్వంబు
బోధించుచున్॥

మ॥ నుత వేదాంత విశారదుండయిన కాండూర్ కృష్ణమా
చార్య పం
డిత కవ్యగ్రణి ముద్దుపెండ్లికొడుకై నీకావ్యకన్యామనః
పతియయ్యెన్ గవయిత్రిరో! యిదిమహాభాగ్యంబు
వృద్ధించు నెం
చితో యేడుల్ పదునొండులోపలి వయస్సే నీదు
జామాతకున్॥

ఇట్లు,
పదాల రామమూర్తి.

శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు
విద్వాన్
B. H. School

GUDUR
10-7-59

శ్రీమంతురాలు మణియమ్మగారు నిర్మించిన మణి మందిరము మిక్కిలి మక్కువతో కనుగొంటిని వర్తమానాంధ్రరచయిత్రీ లోకమున నీమె సముచితస్థాన మలంకరింప గలదనుటలో నెట్టిసందియము లేదు.

ముదివర్తి కొండమాచార్యులు.
విద్వాన్

# కృతజ్ఞత

సీ॥ రాజమహేంద్రాన ϟ రత్నంబునానొప్పి
కవిసార్వభౌముడన్ ϟ ఖ్యాతిగాంచి
భారతంబునువ్రాసి ϟ ప్రఖ్యాతిగన్నట్టి
ప్రతిభతో నొప్పిన ϟ పండితుండు
మణిమందిరములోకి ϟ మక్కువతోఁజని
చూచెనునందలి ϟ చోద్యములను
కృష్ణశాస్త్రియుగాంచి ϟ విష్ణునికొలువును
పరవశంబును జెంది ϟ పలికెనిట్లు

తే॥గీ॥ మఱచె తనగొప్పననఁగను ϟ మాయగాదె
పొగడె పాండిత్యమును లేని ϟ పొలతినన్ను
మనుమరాలిగ నెంచెనో ϟ మదిననంగ
కృపను దీవించె శ్రీపాద ϟ కృష్ణశాస్త్రి.

సీ॥ గట్టిపాండిత్యంబు ϟ ఘనతయునుండిన
గర్వమించుకలేని ϟ కవివరుండు
వాణియిచ్చినధార ϟ వంకరగాకుండ
ఛందస్సు జెప్పిన ϟ శాంతిపరుఁడు
మణిమందిరములోకి ϟ మక్కువగాఁజని
పొలుపొందు శ్రీకృష్ణ ϟ కొలువుగాంచి

యందున్న దేవత ʃ లాదర పరికించి
నాకుబంధువులంచు ʃ నతఁడెఱింగె

తే॥గీ॥ తనయగానన్ను తలచియు ʃ తగువిధాన
మెచ్చెనెంతయొ ప్రీతితో ʃ మేలటంచు
చెప్పెభావాలయందున్న ʃ గొప్పలెంచి
ఘనుడు కాండూరి కృష్ణార్య ʃ కవివరుండు.

సీ॥ సంస్కృతాంధ్రములందు ʃ చక్కనికృషిసల్పి
విద్వానుబిరుదుల ʃ వెలయుచున్న
కవిసహోదరులెల్ల ʃ ఘనతరదీవెనల్
పంపుటచూడనా ʃ భావమందు
నటనకుదిట్టయా ʃ నలువరాణియెవారి
మనసునందుననిల్చి ʃ మాయజేసి
గర్వమన్ బీజంబు ʃ గట్టిగానాలోన
నాటింపతలచెను ʃ నాకుదోచె
పండితుల్ పొగడుట ʃ భారతికేయిచ్చి
దీవెనలన్నియు ʃ తీసికొంటి

తే॥గీ॥ పంచివేసితికాని నే ʃ పంచకున్న
నెట్టుభరియింతు నింతటి ʃ గట్టిబరువు
న్యాయమందురొకాదేని ʃ నరసిమీరు
పరమపండితవర్యులు ʃ పల్కవలయు.

ఇట్లు పండితవిధేయురాలు.
శ్రీమతి, సుంకర మణిరామచంద్రరావు.

శ్రీ కృష్ణాయ నమః

# మహిమందిరము



## దేవతాస్తుతి





కం॥ శ్రీవ్రాసిన శుభమిచ్చును
శ్రీవేడిన సంత లోనె శ్రేయముగలుగున్
శ్రీవరుసనె సిరులుండును
శ్రీవర్ణము గావ్యమునకు క్షేమముగాదే 1

ఉ॥ అమ్మరో రమ్మనంచునిను నారడిచేసితినంచు రాత్రి మా
యమ్మను బోలివచ్చితివి యంతట త్రిప్పియు కాళ్ళనొవ్వగా
దుమ్ములు రేగునట్లునను తొందరఁ జేసియు నెందుబోతి? నే
బమ్మెరపోతరాజునటె భారతినిన్ గని పెట్టిపట్టగన్. 2

తే॥గీ॥ శ్రీలుచిందెడు చిరునవ్వు స్నేహమొలుక
నేనుజేసెడుపనులందు నేర్పునిచ్చి
తోడఁబుట్టువు చందానఁ దోడనున్న
గణపతయ్యకు నేనెప్డు గారెలిడుదు. 3

తే॥గీ॥ మనసునందలి కోర్కెల ÷ మర్మమెఱిఁగి
యడ్డుగల్పించి నొప్పించి ÷ యలఁతఁబెట్టి
నామనోర్వేదా పరికింప ÷ నన్నువిడని
యాదిశక్తికిఁగై మోడ్తు ÷ ననవరతము. 4

తే॥గీ॥ సృష్టినొనరించి పాలించి ÷ నష్టపఱచి
న్యాయనిర్ణయ మెఱుగంగ ÷ నటనసల్పి
మనుజులందున మనుజులై ÷ మసలుచున్న
ముగురుమూర్తులఁ గేల్ మోడ్తు ÷ మోదముగను. 5

తే॥గీ॥ సతుల సౌభాగ్యదేవియౌ ÷ శంభురాణి!
స్త్రీలశోభనదేవియౌ ÷ శ్రీరమాంబ!
సర్వవిద్యల నొసఁగెడు ÷ శారదాంబ!
అందుకొనరమ్మ నాదు న ÷ ల్వాంజలులను. 6

తే॥గీ॥ భారతీయుల పాలిటి ÷ బంధులార!
దేవలోకనివాస సు ÷ దీప్తులార!
యష్టదిక్కుల నేలెడు ÷ నన్నలార!
కరుణదీవించుడయ్యా నే ÷ కరముమోడ్తు. 7

తే॥గీ॥ చీకటులుచీల్చి చెండాడి ÷ చిత్రమొదవ
తూర్పుదిక్కున నుదయించి ÷ నేర్పుమీఱ
మమ్ములేపుచు మహిలోన ÷ మహిమఁజూపు
కర్మసాక్షికి నేనెప్డు ÷ కరము మోడ్తు. 8

తే॥గీ॥ బాలమనసుల నవ్వించు ఽ భాగ్యరాశి
భువిని వెన్నెల కాయించు ఽ పుణ్యమూర్తి
మామలకు తాతతండ్రుల ఽ మామయైన
చందమామకు కేల్ మోడ్తు ఽ సంతసమున. 9

తే॥గీ॥ అణువు మొదలుగ నాకాశ ఽ మంత్యమనఁగ
బ్రహ్మతేజస్సు నిండియే ఽ పరగుచుండ
చేతులెత్తని ప్రాణికి ఽ చేటుగాదె
కానసృష్టికినేనెప్డు ఽ కరము మోడ్తు. 10



# కవయిత్రి చరిత్ర

—★—

సీ॥ శ్రీదేవి వాసంబు ఽ శృంగార నిలయంబు
రత్నాలపేటిక ఽ రాజమండ్రి
రాజరాజేంద్రుండు ఽ రాజ్యంబు చేసిన
రంగైన బంగారు ఽ రాజమండ్రి
కవినన్నయాఖ్యుచే ఽ గంటంబుఁ బట్టించు
రాజకవీంద్రుల ఽ రాజమండ్రి
గోదావరీనాద ఽ గుంభితక్షేత్రంబు
రత్నాలదీవి యీ ఽ రాజమండ్రి

తే॥గీ॥ రమ్యకవులకు వాసంబు ƒ రాజమండ్రి
రత్నవర్తక వైశ్యుల ƒ రాజమండ్రి
రామరాజ్యమువంటిది ƒ రాజమండ్రి
రమ్యరత్నాలుగలకొండ ƒ రాజమండ్రి. 11

సీ॥ పేరుగాంచినయట్టి ƒ పేపరుమిల్లుండె
కోటిలింగాలునాఁన్ ƒ వాటియుండె
దేవాలయములెన్నొ ƒ తేజరిల్లుచునుండె
గౌతమఋషివర్యు ƒ ఘట్టముండె
ఆంధ్రకేసరివంటి ƒ యాంధ్రులు చదివిన
మునిసిపల్ హైస్కూలు ƒ ఘనతనొప్పె
కోటలోపలియంచు ƒ కోటకావలియంచు
కోటగుమ్మంబంచు ƒ గుర్తులుండె

తే॥గీ॥ దాననుండిరి మాతాత ƒ దండ్రులెల్ల
అదియె నాజన్మభూమియై ƒ నమరెజగతి
బాల్యమంతయు గడపిన ƒ భాగ్యభూమి
రమ్యరత్నాలు గలకొండ ƒ రాజమండ్రి. 12

సీ॥ శ్రీపాదశాస్త్రినా ƒ చెన్నొందు చుండెడు
కవిసార్వభౌముండు ƒ కలఁడు కలఁడు
శాంతరూపముదాల్చి ƒ శ్యామలాంబ యనంగ
గ్రామదేవతచూపు ƒ కరుణ గలదు

సంస్కృతబోధల ƒ చక్కని విద్యల
కాంగ్రెసు భవనంబు ƒ కలదుదాన
ఆర్టుగాలరొకటి ƒ యందంబుగానుండె
కళలిచ్చుకళలెన్నొ ƒ కలవుదాన

తే॥గీ॥ గాన కోవిదులెందరో ƒ ఘనులుగలరు
ఆటలందున మేటులు ƒ నందుగలరు
అదియె మెట్టిన యింటికి ƒ నమరుసూరు
రమ్యరత్నాలుగలకొండ ƒ రాజమండ్రి. 13

సీ॥ తవ్వాల వంశంబు ƒ తగుపేరుగాంచెను
బలిజవంశములందు ƒ ప్రతిభగాంచి
తాత తరాలుగా ƒ ధరకీర్తిగాంచిరి
యగ్రహారములుంట ƒ నధిపులనుచు
నాకు ముత్తాతయా ƒ నాగన్నయనగను
తండ్రి తండ్రినిగన్న ƒ తండ్రియతఁడు
తాత వీరాస్వామి ƒ ధన్యులైనటువంటి
నాతండ్రిగారికి ƒ నాన్నయాయె

గీ॥ అతఁడుగాంచెను నల్గుర ƒ ననుఁగుసుతుల
చూడకృష్ణయనాగేశ ƒ సూర్యరంగ
రావుపేరులనొప్పిరి ƒ రమ్యగుణులు
తలపరంగరావనువారె ƒ తండ్రినాకు. 14

సీ॥ సీతమ్మ యనఁగను । తాతమ్మ నాకామె
గౌరమ్మ నాన్నను । కన్నతల్లి
గౌరమ్మసీతమ్మ । ఘనకీర్తి గాంచిరి
ధర్మాత్మురాండ్రని । ధరణియందు
అన్నదానముచేసి । మన్ననల్ పొందిన
మగువలంచును వారిఁ । బొగడుచుండ్రు
తెలిసినవారెల్ల । తేటగాఁజెప్పంగ
వినియుంటి నాబాల్య । వేళయందు

తే॥గీ॥ అట్టితవ్వల వంశంబు । పట్టినేను
రంగరావనుపేరున । రమ్యకవిత
నెఱుగు నాతండ్రినుడులన్ని । మెఱుగులేక
చెదలు కొఱుకంగ యవియన్ని । చెదరిపోయె. 15

తే॥గీ॥ చిన్నతనమౌట నాకప్డు । కన్నతండ్రి
గారికవితల దాచంగ । నేరనైతి
అంత్యదశయును వారికి । నపుడెవచ్చె
వారికబ్బంబు నెలువడు । వసతి తొలగె. 16

తే॥గీ॥ ఊహ తెలిసిన దాదిగా । నుర్వియందు
అడుగు చుండెడు నవియెల్ల । నపుడెయిచ్చి
ప్రేమతో పెంచినట్టి నా । పితృమూర్తి
కన్నతండ్రికి నేనెప్డు । కరము మోడ్తు. 17

తే॥గీ॥ చిన్న ప్రశ్నల వేయుచు । చెంతవిడక
చందమామయ్యకథనాకుఁ । జక్కఁజెప్పు
మనగ నాకథఁజెప్పుచు । మందలించు
కన్నతండ్రికి నేనెప్డు । కరముమోడ్తు. 18

తే॥గీ॥ చుక్కలెట్టులు పుట్టెనో । సూర్యుఁడెట్లు
కొండమీదికి నెక్కెనో । గోటుగాను
ననెడు ప్రశ్నలకెల్లను । నపుడెసెప్పు
కన్నతండ్రికి నేనెప్డు । కరముమోడ్తు. 19

తే॥గీ॥ దేవుఁడెట్టులు పుట్టించె । దేశమంత
అలపురాదయ్య యోనాన్న । యతనికన్న
అపుడె పకపకనగుచును । నంతఁజెప్పు
కన్నతండ్రికి నేనెప్డు । కరముమోడ్తు. 20

తే॥గీ॥ బయట పదిమందిలోనుండి । పలుకుచున్న
నిదురవచ్చెను నాకని । నేనుబిలువ
సెలవునిండని స్నేహితుల్ । చెంతనుండి
యపుడెవచ్చెడునాన్నకే । యంజలిడుదు. 21

తే॥గీ॥ బుజమునందున నిడుకొని । బుజ్జగించి
భాగవత పద్యరత్నాలు । పఠనఁజేసి
జోలబాడంగ నాకప్డు । జోగురాగ
నిదురఁబుచ్చెడు నాన్నకే । నిడుదునతులు. 22

తే॥గీ॥ కాసులమ్మణి నాన్న! ఓ । కన్నా నాన్న!
కథలజెప్పెదు రమ్మను । కమ్మనైనఁ
వచ్చిరానట్టిమాటల । వంపులరసి
చేతనెత్తెదు నాన్నకే । జేజెవిడుదు. 23

తే॥గీ॥ రాజుకూతురు కథజెప్ప । మోజుమీర
రాజుకూతురులాగనే । రమ్యముగను
నాన్న నేర్తును నరునది । నాల్గువిద్య
లనిన నవ్వెడునాన్నకే । వినతిఁజేతు. 24

తే॥గీ॥ అపుడెయధ్యాత్మ రామాయ।ణాదిగీత
ములను జెప్పించెగాన వృ।ద్ధులను జేర్చి
భారతంబును బాగుగ । పఠనఁజేసి
కథలజెప్పెడి నాన్నకే । కరముమోడ్తు. 25

సీ॥ మిన్నువిరుగుచున్న । మీఁదబడుచునున్న
తలయెత్తిచూడని । తలఁపునాది
తిట్టిన పొగడిన । గట్టిగా విననట్టి
మందమైనటువంటి । మనసునాది
కష్టంబుసుఖమును । కనుగొనఁ జాలని
మ్రానునుబోలిన । మతియునాది
ఆకలియనుచును । నమ్మదగ్గరనైన
నడిగి తిననియట్టి । జడతనాది

తే॥గీ॥ అట్టినారీతులనుగని ॥ పెట్టి చూచి
నెజ్జితల్లి యటంచును ॥ విసుగునెఱుఁగ
కుండ నామీఁదచూపుచు ॥ నిండుప్రీతి
కసరు లెరుఁగరునన్నెప్డు ॥ కన్నతండ్రి. 26

సీ॥ నాకువచ్చెడి కలల్ ॥ నాన్నతోఁజెప్పంగ
నద్భుతంబుగ నన్ను ॥ నరయువారు
కలలోన కొండపై ॥ కలదు నాకొకమాత
ఆయమ్మనాకోర్కె ॥ లమరదీర్చు
ప్రతిరాత్రిపేచీలు ॥ పడకనుండియులేచి
అమ్మతీర్చెను నంచు ॥ యలుకతోడ
మీరెవ్వరునునాకు ॥ నేరుగానీవద్దు
అమ్మయే యిచ్చును ॥ ననుచుబల్క

తే॥గీ॥ చిన్నకోపంబు దాల్చెడు ॥ నన్నుఁజూచి
కరముచేనెత్తి ముద్దాడి ॥ కౌతుకముగ
అమ్మరావమ్మ ననుగన్న ॥ కొమ్మయనుచు
నన్ను నవ్వించువారు మా ॥ నాన్నగారు. 27

సీ॥ బడినుండివచ్చుట ॥ గడియైన నాలస్య
మగు నేని మనసున ॥ దిగులుఁజెంది
నౌకరులనుబంపి ॥ నాబడివరకును
మనసుండఁ బట్టక ॥ మరియువారె

ఎదురుగ వచ్చియు ƒ నెన్నాళ్లొ చూడని
  విధమున నన్ జూచి ƒ వేడ్క పడుచు
నా చేయిఁ బట్టుచు ƒ నాప్యాయ మొదవగా
  నడిపించుకొని వచ్చి ƒ కడుముదాన

తే॥గీ॥ అమ్మ యేటికి నాలస్య ƒ మయిన దనఁగ
ఆట జెప్పిరి కోలాట ƒ పాటతోడ
ననఁగ నా చేత పాడించి ƒ నవ్వుకొనెడు
కన్నతండ్రికి మించిన ƒ ఘనులు గలరె.

సీ॥ ఎండ కాయుచునుండ ƒ వేసవి కాలంపు
  గాడ్పులు చెవిసోకి ƒ కాల్చుచుండ
బడికి వెళ్ళెడు నాకు ƒ బలపాల పెట్టెలో
  చిల్లరడబ్బులు ƒ చేత వైచి
నోరెండిపోవును ƒ దారిలో సోడాను
  కొనిపుచ్చుకొనుమమ్మ ƒ యనుచుఁ జెప్పి
మరునాడు కూడను ƒ మరల డబ్బులు వేయ
  పెట్టె తెరువ డబ్బు ƒ లట్టెయుండ

తే॥గీ॥ నపుడె యాశ్చర్యముగఁ జూచి ƒ యనుచు నిట్లు
ఏమి తెలియని పిల్ల నే ƒ నేమి సేతు!
బ్రతుకు దెరువును నెరుఁగని ƒ బాలయనుచు
తలఁచి చింతించువారు నా ƒ తండ్రిగారు,

సీ॥ మానాన్న నన్నంత § మక్కువతోఁజూడ
మాయమ్మ నన్నొక్క § మాటయనదు
నాతోఁడబుట్టువుల్ § ననురాగముగఁజూచి
యాదరింతురు నన్ను § నధికముగను
బంధువులందఱు § బాగుగా నేనన్న
గౌరవించెదువారు § ఘనముగాను
చదువుజెప్పెడివారు § కుదురైన బిడ్డని
వారితనయలాగె § గౌరవింత్రు

తే॥గీ॥ ఆటలాడెడు చెలులును § నక్కచెల్లె
లనఁగ చూచెడు వారెంతో § లక్ష్యముగను
హాయిగొలిపెడు నాబాల్య § మందు సౌఖ్య
మెట్టివారికి రాదని § పట్టిచెపుదు. 30

తే॥గీ॥ అప్పుడుండిన మాయింటి § హద్దురీతి
పరగ పదియేండ్ల ప్రాయంపు § బాల్యమందె
బడికి వెడలుటమానిన § పడతినేను
వినుఁడుచెప్పుదు నాదగు § వింతగాథ. 31

తే॥గీ॥ నాన్నచేర్చుము హైస్కూలు § నందుననుచు
నేనుపేచీలఁ బెట్టంగ § నేర్పుగాను
మగువ నీతులదెల్పు నీ § మారిశతక
పద్యములఁజెప్పి బోధించు § బాగుగాను. 32

సీ॥ ఆసతీయన నూయస్యందాల కథఁజెప్పి
సీతమ్మ కథనంతఁ స్ఫ జక్కఁజెప్పి
చంద్రమతీదేవి స్ఫ చందమంతయుఁజెప్పి
సుమతిసాధను నున్న స్ఫ సొంపుఁజెప్పి
దమయంతి కథనెత్తి స్ఫ ధర్మమంతయుఁజెప్పి
ఆస్వాయంప్రభ కథ స్ఫ యాపుడుసెప్పి
భారత కథలెంచి స్ఫ పతిభక్తియనఁజెప్పి
వారిమించినవారు స్ఫ లేరటంచు

తే॥గీ॥ మనసునొప్పించకుండంగ స్ఫ మాటఁజెప్పి
బుజ్జగింతురు గాని నే స్ఫ పోరుఁబెట్ట
కోపగించరునామీద స్ఫ కొంచమైన
కసరు టెరుగనివారు నా స్ఫ కన్నతండ్రి.

తే॥గీ॥ అంతలోనసె మానాన్న స్ఫ యసులఁబాసె
బాధతెలియని మనసుకు స్ఫ బాణమనఁగ
నాన్నమరణంబునన్నింతో స్ఫ నలతబెట్టె
దైవమాయలనెఱుగంగఁ స్ఫ దరమె తలప.

తే॥గీ॥ అంతనాకేమితోచక స్ఫ చింతగాను
బడికిపంపుడు నన్నని స్ఫ పట్టుఁబట్ట
స్కూలుహెడ్మాష్టరు ఢిసైర్డు స్ఫ శుద్ధయశులు
శాంతినుండిరి నరసింహ స్ఫ శాస్త్రిగారు.

తే॥గీ॥ చదువుచెప్పుట కొఱకును ¶ ముదముగాను
వారిబిలిపించిపెట్టిరి ¶ వైనముగను
జీతమనిగాక ప్రేమతో ¶ తాతవలెను
పాఠములఁజెప్పె నాకంత ¶ పట్టుదలగ. 36

సీ॥ ఆంగ్లభాషను నేర్ప ¶ నపుడె మొదలుపెట్టి
నా శ్రద్ధగని వారు ¶ నయముతోడ
చింతించవలదమ్మ ¶ యెంతేసివిద్యను
నేర్వంగవచ్చును ¶ నింటిలోన
ఇంగ్లీషుభాష నీ ¶ వెంతయొ వడినేర్చి
చదివి పరీక్షకుఁ ¶ జనగవచ్చు
ననుచు దెల్పుచునాకు ¶ ఘనత మీరగఁజెప్పె
స్కూలుఫైనల్ కోర్సు ¶ సూత్రములను

తే॥గీ॥ ఇట్టులెంతయుశ్రద్ధగా ¶ పట్టిచెప్పి
చక్కనైనట్టి శ్లోకాలు ¶ చదువుచుండి
దానియర్థంబు చెప్పెడు ¶ తాతబోలు
నట్టి నరసింహ శాస్త్రికే ¶ నతులఁజేతు. 37

సీ॥ మావీధి గదిలోన ¶ మరియెవ్వరోగాని
శాస్త్రిగారినిఁ జూచి ¶ చనవుతోడ
పావుఘంటకులోనె ¶ పాఠంబు చదివెనా
యేమిచెప్పితిరని ¶ యెంచియడుగ

ననుభవంబున్నట్టి ¶ ఘనుడఁగునాశాస్త్రి
పకపక నగుచును ¶ పలుకునిట్లు
రావివారికివిద్య ¶ రాత్రియుపగతైన
చెప్పిన వచ్చునా ¶ చిన్నపలుకు
విద్యనేర్పుటకేను ¶ వెడఁగుటలేదయ్య
జన్మాంతరావాస ¶ జడతనుండి

తే॥గీ॥ లేపుచుంటిని నామెను ¶ వీపుతట్టి
యనుచు చెప్పితి నిన్ననే ¶ యతనితోడ
ననుచు నవ్వుచు మరునాడు ¶ నాకుజెప్పి
నట్టినరసింహశాస్త్రికే ¶ నతులఁజేతు.

సీ॥ పెద్దవారలువారు ¶ పిల్లగాఁజూడక
మీరని పిలిచినన్ ¶ గౌరవింప
తాతబోలినవారు ¶ తండ్రికిగురువులు
మీరని నన్బిల్వ ¶ మేలుగాదు
అనిన నవ్వుచుశాస్త్రి ¶ యౌనా నది నిజమమ్మ
చిన్నపెద్దలులేవు ¶ చిత్తమునకు
మీయందుభారతి ¶ మేళవించియెయుంటె
గౌరవించుట తప్పు ¶ కాదటంచు
చిరునవ్వుతోవిద్య ¶ గరపినయటువంటి
నరసింహశాస్త్రికే ¶ నతులఁజేతు

తే॥గీ॥ కొంతకాలము చదువందు ƒ కొరతలేదు
కానివిఘ్నంబు గలిగెను ƒ కర్మఫలము
కంటిలో దుమ్ముపడి వారి ƒ కంటిచూపు
కనుపడకపోయె వార్ధక్య ƒ కాలమూలు. 39

సీ॥ అంతటనాలోన ƒ వంతనుజెందితి
చదువుకు నోచని ƒ చాననసుచు
గౌతమీయనియేఁడు ƒ గ్రంధాలయమునుండి
పుస్తకాల్ తెప్పించి ƒ పొలుపుమీర
చదువుచుండియు నేను ƒ చక్కనై నటువంటి
భాగవతంబును ƒ పఠనఁజేసి
నరసింహశతకశం ƒ కరకృతలక్ష్మీ నృ
సింహుని నుతియును ƒ చెప్పుచుందు

తే॥గీ॥ గీతచదువుచు కాలంబు ƒ గెంటుచున్న
పెండ్లి చేసిరి నాకప్డు ƒ పెద్దలంత
నింకనాయత్తవారిదా ƒ యింటిరీతి
యదియుఁ జెప్పెద నికమీద ƒ నందముగను. 40

సీ॥ సుందరంబయినట్టి ƒ సుంకర వంశాన
రామయ్యనాయఁడు ƒ రత్నమనఁగ
సాధుసంతర్పణ ƒ సతతంబు చేయుచు
రాజయోగంబున ƒ తేజమొందె

రెస్టేటులన్నియు ॥ నష్టంబులయినను
ధర్మంబు విడువని ॥ ధన్యుఁడతఁడు
పత్ని రామాయమ్మ ॥ పతిసేయుపనులకు
నడ్డంబు పలుకని ॥ యబలయట్టి

తే॥గీ॥ పావనంబైన దాంపత్య ॥ ఫలముగాను
జనన మందిరినాపతి ॥ జనకులరయ
ప్రతిభగాంచిరి వైద్యాన ॥ ప్రముఖులనుచు
స్వామి యనుపేర బరగు నా ॥ మామగారు.

సీ॥ పదిమంది వత్తురు ॥ పలుకులబలమేమొ
స్వామినాయఁడుగారి ॥ సఖ్యమునకు
ఉచితంబుగా వైద్య ॥ మోర్పుతో చేయంగ
ధర్మాత్మ డాక్టరు ॥ దారులనిరి
పేదలనందఱిఁ ॥ ప్రేమతో చూడంగ
కనికరంబున జాల ॥ ఘనతగాంచె
అందఱు నమ్మిచు ॥ నాదరించుచునున్న
మహనీయుఁడా నాయఁ ॥ డహహాయనిరి

తే॥గీ॥ ధరణి సుంకరవంశమన్ ॥ తరువునందు
స్వామియన్ పుష్పరాజంబు ॥ సంభవిల్లె
పలుదెసలు వీచెనాపుష్ప ॥ పరిమళంబు
మరపురానట్టివారు నా ॥ మామగారు.

సీ॥ సర్వంబు తెలిసియు గర్వంబు నెఱుఁగక
తండ్రిఁబోలినవారు ధన్యతములు
సంస్కృతాంధ్రములన్నఁ జక్కనియభిలాష
పండితస్నేహాన నుండువారు
మాయమర్మము లేని మనసొప్పియుండుట
గొప్పవారనఁగను నొప్పువారు
వారియింటికి నేను గౌరవమొప్పంగఁ
బెద్దకోడలనైతి పేర్మితోడ

తే॥గీ॥ ఘనులు నా మామగారంత గారవించి
తనయగానన్ను జూచిన తనువిధంబు
మాటు పడదయ్యె మనసును దాటుకొనదు.
మరపురానట్టివారు నా మామగారు 43

సీ॥ మణియమ్మయనుచును మనసార బిల్చుచు
సొక్కుచు ప్రేమతోఁ జూచువారు
స్వల్పసేవకునైన నల్పసంతోషంబు
పొందుచు పరులతో పొగడువారు
తల్లిలాగున సేవ లెల్ల చేయుచునాకు
ననుచుచెప్పెడువారు నన్నుగూర్చి
అధ్యాత్మకీర్తన లన్నియుపాడించి
సంతసించెడువారు సంభ్రమముగ

తే॥గీ॥ పద్యముల్ శ్లోకములనన్ని § పఠనఁజేయు
స్వచ్ఛమైనట్టి వాక్కుని § మెచ్చుకొనుచు
తండ్రి మరపించగలవారు § ధన్యులగయ
మరపురానట్టివారు నా § మామగారు. 44

సీ॥ నాపతి యంతట § నరిగెవైజాగుకు
వైద్య విద్యను నేర్చి § వచ్చుకొఱకు
పదము లొత్తెడు వేళ § పలుమారు జెప్పెను
బాగుగా చదువంగ § పట్టుబట్టి
జాబును వ్రాయుము § శ్రద్ధగా నీవని
కన్నకూతురుమాడ్కి § కాంచినన్ను
చెప్పియు మరునాడు § చెంతకు ననుబిల్చి
కమ్మవ్రాసి తెమణి § యమ్మయనును

తే॥గీ॥ చనవు నిచ్చియు నన్నెంతొ § ఘనతగాను
తండ్రిలేరను లోటును § తరిమెవారు
నన్నుజూచిరి యెంతయు § మిన్నగాను
మరపురానట్టి వారు నా § మామగారు. 45

సీ॥ నాచిన్నతనమున § నాతండ్రిగారును
మామగారును నెంతొ § మైత్రితోడ
రోజునకొకసారి § మోజుగావచ్చుచు
మానాన్నతో వారు § మాటలాడి

ఏమాటయైనను ౯ నిష్టంబుగాఁజెప్పి
సలహాలనడుగుచు ౯ సరియెయనుచు
పెద్దవారిగనెంచి ౯ కొద్దియైననుదెల్పి
గౌరవించెడువారు ౯ ఘనతమీర

తే॥గీ॥ మామగారును నాన్నయు ౯ మాటలాడ
కాఫీత్రాగెడు కాలంబు ౯ కాదు గాన
చిక్కనైనట్టి మజ్జిగ ౯ చక్కదెచ్చి
మామగారికినేనీయ ౯ మక్కువగను. 46

తే॥గీ॥ పేరుయేమిటి నీదని ౯ ప్రీతిగాను
నడిగినను పల్కనటువంటి ౯ నన్నుఁజూచి
పల్కలేరావమీదగు ౯ పాపకనుచు
నాన్నతోగూడి వారును ౯ నవ్వువారు 47

సీ॥ కార్లుతక్కువయట్టి ౯ కాలంబునందున
మామగారు కొనిరి ౯ మంచికారు
సాయంతనపువేళ ౯ చక్కగ కారులో
రోగులచూడంగ ౯ నేగువారు
వారితోవరువచ్చి ౯ వాకిలిముందుకు
ననుబిల్చి రమ్మను ౯ చనవుగాను
జోడుతోమేజోళ్లు ౯ జోడించినేతేగ
కారులో నాతండ్రి ౯ కాళ్ళకేయు

తే॥గీ॥ ఇంతలో మామగారెక్క — వింతగాను
నన్ను జూచుచు నవ్వుచు — నను నిట్లు
ఎట్లు వచ్చెను కారును — నెక్కఁ జాలకు
పిల్చినను పల్కనట్టి నీ — పిల్లతాను. 48

సీ॥ నా తోడ మాట్లాడ — నామోషి గా నీకు
నా కారు నెక్కంగ — న్యాయమా న
యని చేయి బట్టియు — నను బిల్చినన్ గాని
వారిదగ్గర గాను — జరుగ నేను
మరునాడు వచ్చియు — మా యింటఁ గూర్చుండి
మా నాన్న ప్రక్కను — నన్ను జూచి
మూగదా యేమి మీ — ముద్దుకూఁతురటంచు
హేళగాఁ ననుజూచి — గేలిచేయ

తే॥గీ॥ నపుడు నవ్వుచు నిట్లను — నాన్నగారు
నోరులేనట్టి బాలిక — దూరమైన
బడికి పంపగ కూడను — భయము నాకు
వెఱ్ఱిదని చెప్పువారు నా — వెఱ్ఱితండ్రి. 49

తే॥గీ॥ కొత్తవారలు కారు నా — యత్తవారు
అపుడె కూడను నాకర్మ — యడ్డమువచ్చె
మామగారును మరణింప — మనసునందు
తగిలె రెండవ బాణంబు — ఘాటిగాను. 50

# 1958 సం॥ స్వప్నము: అంకితము



సీ॥ నెల్లూరనుండంగ ƒ పిల్లలు నేనును
చల్లని పంకాను ƒ మెల్లవైచి
పదిఘంటలాయెను ƒ నిదురపొండనుచును
కథలాపనేను న ƒ క్కాలమందు
పత్నియేగియుండిరి ƒ పనిగల్గిదూరాన
నిడదవోల్ మిత్రుని ƒ నిలయమునకు
అపుడె నిద్దురరాక ƒ యటునిటుదొర్లుచు
గడచినకాలమే ƒ కండ్లఁదోచ

తే॥గీ॥ అంతదలఁచితి బాల్యంపు ƒ టాటలన్ని
దలఁచినంతనె నాతండ్రి ƒ తలఁపు గలిగె
తండ్రిబోలిన వారలు ƒ ధన్యులయిన
మామగారును నాకప్డు ƒ మదికిరాఁగ. 51

తే॥గీ॥ వారలుండిన నేనెంతొ ƒ వాసిచెంది
భువిని రాణింతుననుచును ƒ బుద్ధిగలుగ
అట్టివారల ఋణమునే ƒ నెట్టుదీర్తు
ననుచు దలపంగ నామది ƒ నలతఁజెందె, 52

తే॥గీ॥ శాంతినిలయాలు గట్టియు | సత్రములను
కట్టియీయంగఁ జాలిన | కాంతగాను
మనసునూహలఁ కృతిగనే | ఘనతకాంచి
తండ్రిమామల పాదాల | దండనిడుదు. 53

తే॥గీ॥ అనుచుఁ దలఁచితి మనసున | నంతలోనె
కలఁతఁజెందిన నేనప్డు | కనులుమూయ
వీధితలుపును తట్టుచు | వింతగాను
పరిచయంబుగ పిలిచిన | పరుగుతోడ. 54

సీ॥ గబగబ వెడలి నే | గడియతీసియు వేగ
వచ్చిన వారిని | గ్రుచ్చిచూచి
గడపదాటియు వారు | గదిలోకివచ్చిన
భ్రమాన్ పడి నానోట | మాటరాదు
మానాన్నప్రక్కను | మామగారుండిరి
చోద్యమాయెను నాకు | చూడగాను
చిట్టచివరకప్డు | చేరువగనుపించు
పేముకుర్చీలెత్తి | ప్రీతినైచి

తే॥గీ॥ కండ్లనెత్తుచు వారిని | గాంచిన-త
నన్నుచూచుచు చిరునవ్వు | నాట్యమాడ
[illegible] ముకూర్చుండ నేనంత | నచటి కరిగి
వారిపాదాలమ్రొక్కంగ | వంగునపుడు. 55

తే॥గీ॥ నన్నునొంటిగ విడిచియు § నాన్నమీరు
మామగాడను నేదేశ § మందునుంటి
రింతకాలంబునకు నేను § నిచటనుండ
నన్ను వెదకుచువచ్చితో § నాన్నయనిన. 56

సీ॥ గట్టుతెగిన యట్టి § గంగాప్రవాహంబు
హద్దులేకుండను § నరుగుపగిది
నాకండ్ల నీరేమొ § దాకొన్నరీతిగా
జలజల వర్షంపు § జల్లులయ్యె
నాల్గుపాదాలను § నాదుచేతులఁ బట్ట
కన్నీటిజలములే § కాళ్ళుకడిగె
నాతండ్రి కన్నీట § నాతల తడిసెను
మామగారప్పు నన్ § మందలించి

తే॥గీ॥ గడ్డమెత్తియు కన్నీరు § కరముతోడ
తుడిచివైచుచు ప్రేమతో § నుడివిరిట్లు
చూడుమణి యమ్మనీవిట్లు § వాడియుండ
నాన్నగారెంతొ నిన్ జూచి § నలఁతబడిరి. 57

సీ॥ నాయఁడుగారెంతొ § నలతనుగొన్నారు
నీదైన తీరును § నిలిచిచూచి
దేశాటనములాపె § తీరికయ్యెను మాకు
నీచెంతనుందుము § నిక్కముగను

అనుచు నోదార్చుచు నందున్న బిడ్డల
చిరునవ్వుతో గాంచి చేతులెత్తి
చంటిబిడ్డయు నేడ్వ చప్పున లేచితి
కన్నీటితో నిండి కన్నులుండె

తే॥గీ॥ అద్భుతంబైన కలవచ్చె ననుచు నేను
మోదమందితి వారికి మ్రొక్కి మదిని
నట్టి నా తండ్రి మామల గట్టి కరుణ
కాచుచుండును నన్నెట్టి కాలమందు. ౫౮

తే॥గీ॥ వారికంకిత మీయన వాంఛగాను
భావరాసుల నాకిచ్చె భారతమ్మ
తండ్రిమామల యాత్మల దనరు శక్తి
నాకుతోడౌచు కలమును నడుపుగాక. 59



నా పుత్రి మామగారు

కృ తి ప తి



శ్రీ సుంకర స్వామినాయుడుగారు

డాక్టర్ - రాజమండ్రి.

కవయిత్రి తండ్రిగారు

కృ తి ప తి



శ్రీ తవ్వాల రంగారావు నాయుడుగారు

బి. యస్. - రాజమంద్రి.

# గ్రంథావతరణ సంకల్పము ప్రతిన

సీ॥ తల్లిదండ్రులనెంచి — తగుభక్తితోఁ మ్రొక్కి
అత్తమామలకంత — యార్తి మ్రొక్కి
* వీరభద్రుండన — వెలసిన యటువంటి
పాపతోఁబుట్టుకు — భక్తి మ్రొక్కి
అత్తింటి పుట్టింటి — యారాధ్యదైవాల
కులదేవతలకంత — కోరి మ్రొక్కి
ఛందస్సు నెరిగించి — చక్కంగఁ జేసిన
కాండూరి కృష్ణార్య — కవికి మ్రొక్కి

తే॥గీ॥ వ్రాయుచుంటిని నాచిన్న — వ్రాఁతలోన
పిలుచుచుంటిని పరమాత్మ — పలుకుమనుచు
పలుకకున్నను చెప్పుదు నే — పంతగించి
దైవమే లేదటంచు నీ — ధరణియందు. 60

సీ॥ వరపవిత్రతనాకు — పరమలక్ష్యంబేని
పతిపాదములఁ గొల్చు — సతినయేని

---

* నాతోఁబుట్టువు చంటిబిడ్డగా నుండి చనిపోయెను. వానిని వీరభద్రుఁడు అను పేరుతో కొల్చుట మా దేశాచారము.

ఊహ తెలిసినంత  నుర్వియందుననున్న
పాపాలభయపడు  పడఁతి నేని
పెద్దలయందున  నొద్దికగానుండి
వారిప్రేమను బొందు  వనిత నేని
దేవతాశక్తియే  భావాల నియ్యంగ
కవితను మొదలిడు  కాంత నేని

తే.గీ. పల్కి రమ్మింక నాయింట  పదము నిడఁగ
రావదేనియు నిన్నింక  రచ్చకీడ్చి
పరువుదీతును నిదియ నా  ప్రతిన వినుము
దైవమే లేదటంచు నీ  ధరణియందు. 61



# మహోమందిర

## ప్రారంభము



సీ॥ శ్రీనివక్షంబున చెన్నొందఁ దాల్చిన
చక్కని నవ్వుల ξ చక్రధరుఁడ

అలకివైకుంఠాని ξ కంజాలరాజువై
ధర్మపాలన చేయు ξ ధర్మదేవ

దశరూపముల దాల్చి ξ ధర్మసంస్థాపన
పాలపొందఁజేసిన ξ పుణ్యామూర్తి

సర్వజీవులకును ξ సమవర్తనుఁడవైన
తండ్రినీవేకదా ξ ధర్మరూప

తే॥గీ॥ అట్లునేనొక తనయను ॱ నాదిమూర్తి
భక్తినాతిథ్యమిత్తు నా ॱ శక్తికొలది
రమ్ము రమ్మయ్య మణిమంది ॱ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॱ పంతమేల. 1

సీ॥ కరిని గాచినయట్టి ॱ ఘనుడవునీవంచు
ప్రహ్లాదుఁ బ్రోచిన ॱ ప్రభుడవంచు
భక్తరక్షణచేయ ॱ భద్రకంకణమెప్డు
కరమునదాల్చు ము ॱ రారియనుచు
కలియుగంబునఁగూడ ॱ పలుపలువిధముల
భక్తబృందము కంట ॱ పడితివంచు
వ్రాసిన కథలన్ని ॱ వరుసగా నమ్మి నే
నన్నుఁ బ్రోచెదవంచు ॱ నమ్మియుంటి

తే॥గీ॥ ఇట్టితరి నీవు వచ్చుట ॱ గిట్టకున్న
ఎట్లునమ్ముదు నీకథల్ ॱ గట్టివనుచు
రమ్ము రమ్మయ్య మణిమంది ॱ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॱ పంతమేల. 2

సీ॥ ఈవిశ్వసంసార ॱ వివిధకార్యములందు
విసుగుఁజెందుచు నీవు ॱ వినుటలేద
ప్రారబ్ధ కర్మల ॱ పడతినేననుచును
పలుమరు పిలిచిన ॱ పలుకలేద

కాశీ ప్రయాగల గ ఘనతరక్షేత్రాల
చూడక యున్నదీ గ సువతి యవియ
దేవాలయముకేగి గ దైవదర్శనమైన
చేయజాలని యట్టి గ చేడెయనియు

తే॥గీ॥ ఎట్టిమనసున నుంటివో గ తట్టదాయె
భక్తసులభుఁడవంచునా గ సక్తిగాను
రమ్ము రమ్మయ్య మణిమంది గ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ గ పంతమేల. 3

సీ॥ నీవుప్రోచినయట్టి గ నీభక్తులెల్లరు
నీకెట్టి చుట్టాలు గ నాకుఁజెప్పు
తల్లి తరపువార గ తండ్రిదగ్గర వార
తాతముత్తాతల గ తరమువార
అత్తమామల వంశ గ మంటిన చుట్టాల
యెట్లు చుట్టాలైరో గ యెంచి చెప్పు
చెప్పకున్నను నిన్ను గ తప్పకుండగ నందు
పక్షపాతముఁ జూపు గ ప్రభుఁడవనుచు

తే॥గీ॥ తట్టిచెప్పంగ గలను నే గ ధరణియందు
అలుసుదనమేల నామీఁద గ నలుకమాని
రమ్ము రమ్మయ్య మణిమంది గ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ గ పంతమేల. 4

సీ॥ నీకునాకునుగల । నిండైన బంధుత్వ
మెఱిగింతు నిపుడేను । సరిగవినుము
నాతండ్రి నీవంటి । నీతనూజనునేను
నాయింట నడుగిడ । న్యాయమంటి
నాకున్న దానిలో । నీకీయ గలనంటి
చేతులారగ సేవఁ । జేతునంటి
సృష్టి చిత్రములెల్ల । స్పష్టంబుగానిన్ను
నడిగి తెలియఁగనే । గడఁగియుంటి

తే॥గీ॥ దట్టమైనట్టి నామది । కట్టడాన
నిన్నుచూచెడు కోర్కెయే । నిండుకొనియె
రమ్ము రమ్మయ్య మణిమంది । రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ । పంతమేల. ౫

సీ॥ వేదాంత మార్గంబు । వినలేదు కనలేదు
ప్రణవబీజాక్షర । పఠనలేదు
పంచాక్షరిజపంబు । భక్తిచేయగలేదు
హరికథల్ వినుటకు । నరుగలేదు
ధరను నీభక్తుల । దర్శింప చనలేదు
పుణ్యనదులనేను । మునుఁగలేదు
నీనామ చింతన । నిశ్చల మనసుతో
జపమాల ధరియించి । జరుపలేదు

తే॥గీ॥ ఒప్పుకొంటిని నాతప్పు । లొప్పుగాను
జాలికలుగంగ లేదయ్య । జాలమేల
రమ్ము రమ్మయ్య మహిమంది । రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ । పంతమేల. 6

సీ॥ సంసార మనునట్టి । సాగరమందున
శాంతియన్ నౌకను । చక్కనెక్కి
నిన్ను చేరెదనంచు । నేర్పుతో నడుపంగ
ఆశయే యనుగల । యడ్డు పరచు
దారి తప్పినవేళ । తల్లడిల్లుచునుందు
సరిమార్గ మరయంగ । సాధ్యపడదు
నీసహాయ మెఱింగెను । నేర్పరు లెవరన్న
నేనెంత దాననో । నీవె చెప్పు

తే॥గీ॥ సృష్టికర్తకై రక్షింప । కష్టమైన
దారి చూపెను ధన్యులి । ధరణినెవరు
రమ్ము రమ్మయ్య మహిమంది । రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ । పంతమేల. 7

సీ॥ సంసార శకటంబు । సంతోషముగనెక్కి
సరియైన త్రోవనే । జనుచునుండ
క్రోధంబునాఁ బులి । గాండ్రించుచునువచ్చి
సహనమే యనునెద్దుఁ । జంపఁజూడ

నాయుధంబులు లేని యబలనే నెట్టులు
కాపాడగలనంచు కలతఁజెంది
కరుణించరమ్మని కష్టబాధతోఁబిల్వ
కదలవు మెదలవు కంటఁబడవు

తే॥గీ॥ నటనయేటికి నన్నింత నలతబెట్టి
చూచుచుందువు నామాట చొరదదేల
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 8

సీ॥ ఎట్టిచనవుచేత నిట్టుపిలిచితి వంచు
అడిగెదవేని నే నడిగఁజెప్పుదు
క్రొత్తవాఁడవుగావు బిత్తర పడుటకు
నిదివరకొకసారి నిన్నుగంటి
జ్ఞాపకంబును జేతు దాపరికంబేల
అప్పుడౌనని నీవు సెప్పగలవు
మాయబెట్టకు మింక మనసును మరపించి
ముప్పుతిప్పలుబెట్టి తప్పకొనకు

తే॥గీ॥ మనసు విరిగినమీఁదట మందులేదు
విసుగు గలిగించనీకొక విలువతగ్గు
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 9




సీ॥ అయిదేడుల ప్రాయ ఽ మబలనై యుండంగ
పందిరి మంచంబు ఽ పరుపుపైన
మానాన్నయొద్దను ఽ మక్కువమాటలు
పలుకుచు దొర్లుచు ఽ పరుపుచివర
వఱకువచ్చియు నేను ఽ వంగిచూడగ క్రింద
పడగవిప్పిన పాము ఽ పడక గాంగ
శేషి పరుండిరో ఽ సొన్నైపు చూచుచు
నాప్యాయ మొదవగా ఽ నవ్వలేద

తే॥గీ॥ మరతు నెట్టుల యాదృశ్య ఽ మహిమ నేను
అట్టి దయ నేడు నామీద ఽ నంతరించె
రమ్ము రమ్మయ్య మణిమంది ఽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 10

సీ॥ నాన్న చూడుము నంగి ఽ నాగరాజుండెను
దానిపై విష్ణువు ఽ దనరుచుండె
అనఁగ మానాన్నప్డు ఽ కనులతో నిన్ గాంచ
తొంగిచూడఁగ నీవు ఽ దొంగవోలె
దొరకవుకాని నే ఽ మరిమరి చూడంగ
అట్టులేనాకండ్ల ఽ కగుపడంగ
నామాట నిజమని ఽ నమ్మింపఁ గలనయ్య
జడిసితి ననిదృష్టి ఽ వడిగదీసి

తే॥గీ॥ భయములేదమ్మ యనుచును ఽ దయగనన్ను
నిద్రబుఁచ్చిరి నామాట ఽ నిజముకాద
రమ్మ రమ్మయ్య మణిమంది ఽ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 11

సీ॥ నేను చూచినరూపు ఽ నిజముగా వర్ణింతు
కాదేని నామాట ఽ కల్లగాద?
తెల్లనికాంతులు ఽ చల్లంగ వెదజల్ల
దంతంబుఁ బోలిన ఽ ధవళవర్ణు
తలనాను నొకచేయి ఽ తలగడగా నుండ
పాము పడక గాగ ఽ పవ్వళించి
విరివైన కన్నులు ఽ విప్పిచూచిన చూపు
చొప్పుల మరువను ఽ నిప్పుడైన

తే॥గీ॥ చూచియుంటిని నీదగు ✽ చోద్యరూపు
మరువలేదయ్య యదియెప్డు ✽ మదినినుంచు
రమ్ము రమ్మయ్య మణిమంది ✽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ✽ పంతమేల. 12

సీ॥ నీలవర్ణుఁడవంచు ✽ నీచాయ పొగడెదు
కథలును చిత్రాలు ✽ కలవు భువిని
నేను చూచిన తీరు ✽ నీలవర్ణముగాదు
తెల్లని చాయయే ✽ కల్లగాదు
ఏదినిజమోయంచు ✽ నేదియుఁదోఁచక
సంశయాలెన్నియో ✽ చంపుచుండ
సదయహృదయుడవు ✽ సజ్జనప్రియుడవు
నీనోట వినగనే ✽ నిన్నుఁబిలువ

తే॥గీ॥ ఎరుగనట్టులెయుందువు ✽ కరుగరాని
కఠినతరమైన మనసని ✽ కంటినౌర
రమ్ము రమ్మయ్య మణిమంది ✽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ✽ పంతమేల. 13

సీ॥ స్థూలదృష్టిని నిన్ను ✽ చూడంగ జాలిన
నేనెంత ధన్యనో ✽ నీవెసెప్పు
స్వప్నఁబులందు నీ ✽ చక్కని లీలలు
గనియుంటి నెన్నియో ✽ ఘనతమీర

అదిమొక్కఁడైన నీ ƒ మదినుండెనో? లేదొ
యెఱిగింతునిపుడైన ƒ మఱపుపోవ
ఇంతకీమఱపున్న ƒ నింతగాసృష్టిని
పాలించుటెట్లయ్యా? ƒ పరమపురుష

తే॥గీ॥ నటన పరుడవు నీవని ƒ నాకుఁదోచె
నిన్ను నమ్మితి నింకైన ƒ నన్నుఁబ్రోవ
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 14

సీ॥ లెక్కకలవి కాని ƒ చెక్కరాల్ గలయట్టి
శకటమొక్కటిబోవు ƒ శరముపోలె
ఒంటరిగానేను ƒ నొకచోట కూర్చుండి
దిక్కుతోచక యుండి ƒ వెక్కియేడ్వ
శంఖ చక్రగదల ƒ శాంతముగాఁదాల్చి
నాల్గవ చేతితో ƒ నన్నుతట్టి
భయము లేదనుచును ƒ నయమున చెప్పంగ
నలుదిశలను జూచి ƒ కలువరమున

తే॥గీ॥ ఒకరి ప్రక్కను నొకటిగా ƒ శకటమంత
నీదురూపాలె కనుపించె ƒ నిజము కాద
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 15

సీ॥ ఇట్టి స్వప్నములన్ని ſ గట్టిగా నుడివిన
పిచ్చిదానిగ నన్ను ſ పిలుతువయ్య
నీవుమఱచితంచు ſ నేఁ జెప్పితిని గాని
చెప్పకూడదు సుమా ſ గొప్ప కొఱకు
దేవనీచూవులే ſ యే వేళ నా వెంట
నున్నవైతోఁచు నా ſ కన్నులకును
నేచప్పుడైనను ſ తోఁచకుండగ జూతు
నీవువచ్చితివేమొ ſ నేటికనుచు

తే॥గీ॥ మక్కువన్నది యుండగ ſ చక్కరాగ
జరుగుగౌరవ మామీద ſ జరుగఁబోదు
రమ్ము రమ్మయ్య మణిమంది ſ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ſ పంతమేల. 16

సీ॥ ఒకవంక జననియు ſ నొకవంక నీవును
నన్ను శోధించుట ſ న్యాయమేన
సృష్టిలో నెందఱో ſ పుష్టితోనుండంగ
పడతినౌనామీద ſ పంతమేల
అడుగడుగున నాకు ſ కడుపరీక్షలు బెట్ట
భారంబుగా నేను ſ బాధపడుదు
రక్షించు వారలే ſ శిక్షింపఁ జూచిన
కరుణతో నన్ గాచు ſ ఘనులుకలరె

తే॥గీ॥ అడుగుచుంటిని నిన్నునే § బడలియుండి
కష్టపెట్టకు నన్నింక § కపటధారి
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 17

సీ॥ నడచివచ్చెదవేమొ § గడబిడగానీవు
గరుడుని నెక్కినేమొ § కదలిరమ్ము
ఒంటరిగావద్దు § జంటగానేరమ్ము
మాయమ్మతోడనే § డాయరమ్ము
శంఖ చక్రాల్ వీడి § చక్కవచ్చెదవేమొ
చేతదాల్చిన తఱు § వాత రమ్ము
ఆదిశేషునిబాసి § యట్లె వచ్చెదవేమొ
యతనితో వచ్చిన § నందమగును

తే॥గీ॥ ఏవిలేకున్న నిన్నెట్లు § దేవుఁడనుచు
తెలియగలనయ్య నాకంత § తెలివిగలదె
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. 18

సీ॥ దేవతాగణముల § దీవింప రమ్మను
బ్రహ్మదేవుని బిల్వు § పత్నితోడ
అన్నిటియందును § మిన్నగానినుఁజూచు
గౌరిశివులఁ బిల్వు § గట్టిగాను

వారిపజ్జనుండు వీడుండుమఱుగుజ్జు
గణపతిఁ పట్టుక కట్టితెమ్మ
నందికుమారస్వామి నందఱ రమ్మను
ఘనుకుబేరుని వెంట గొనియెరమ్మ

తే॥గీ॥ వీరినందఱఁ బూజించి నేరుగాను
మనవిఁ జేతును సంశయాల్ మనసువిప్పి
రమ్మ రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 19

సీ॥ మన్మథుఁ బిల్చుట మరచిపోకుముసుమా
చిత్రగుప్తునిఁ గూడఁ జేర్చితెమ్మ
ఇంద్రలోకపురాజు నింతితోఁ రమ్మను
మా బృహస్పతి గురుం డతనిఁ గూడ
వీరువారని చెప్ప భారమాయెను నాకు
నందున్న వారల నిందు తెమ్మ
రాజుగానీవుండ మోజుగానీచుట్టు
తీర్చిన కొలువు క న్నార్చకుండ

తే॥గీ॥ కలవుదీరంగ జూచెదు ఘడియయెపుడో
యనుచు నామది తహతహ లాడుచుండె
రమ్మ రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 20

సీ॥ ఇంతమందినిఁ బిల్చి - యింతి తానేగతి
నాతిథ్యమీఁగల - దందువేమొ
నాత్రిలోకాల - నాథుఁడై యుండంగ
నాకేమికొదువ భూ - లోకమందు
అన్నియు సమకూర్చు - నమ్మ నాకుండంగ
వారికి మర్యాద - భారమౌనె
చేదోడుగానుండ - చిన్నారిగణపతి
పనులెల్లఁ గావను - భయము దేల

తే॥గీ॥ యమరకాంతలు నన్నెప్డు - నాదరింత్రు
జరుగు పనులెల్ల వారలే - జరుపఁగలరు
రమ్ము రమ్మయ్య మణిమంది - రానికనిన
పలుకవేలయ్య పరమాత్మ - పంతమేల. 21

సీ॥ మారుమాపులఁ దాల్చి - మీరు రాకుడుసుమా
మర్యాదజరుగదు - మాటలేల
వచ్చుమూదరనాకు - కచ్చితంబుగఁ జెప్పి
గణపతితో మీరు - కబురుపెట్ట
నాయిల్లు కడిగియు - నట్టింట ముగ్గించి
గుమ్మాల పసుపుకుం - కుమలు పెట్టి
మామిడి తోరణాల్ - మఱియిన్ని కట్టి నే
చిరుచాపలన్నియు - పరచియుంచి

మద్దైనునీకొక ౯ గద్దైను గట్టింతు
నమ్మకు నీకును ౯ నదియె చాలు

తే॥గీ॥ ఇట్టులున్నట్టి నాయూహ ౯ గట్టితనము
నమ్మ చేయక నన్నింక ౯ వంతలిడక
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 22

సీ॥ కైలాస వాసికి ౯ కాంతతో సరిపోవు
కల్పపీఠంబేతు ౯ ఘనతగాను
నిండైనపీఠంబు ౯ నీపుత్రునకువేతు
చదువులరాణితో ౯ చాలునట్లు
మూర్తులుముగ్గురు ౯ ముచ్చట్లు చెప్పుచు
నొక్కచో కూర్చున్న ౯ చక్కదనము
చిరుచాపలకునిండ ౯ వరుసగాకూర్చున్న
దేవతాబృందంబు ౯ తేజమంత

తే॥గీ॥ భక్తినేచూడజాలెదు ౯ శక్తినిచ్చు
భారమంతయునీమీద ౯ భద్రపఱతు
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుకవేలయ్య ౯ పరమాత్మ ౯ పంతమేల. 23

సీ॥ రత్నఖచితమైన ౯ రంగైన పీఠాలు
వేతునంచును మీరు ౯ చూతురేమొ

గొప్పలుసెప్పంగ ϟ చప్పగా నుండును
నాకుఁగల్గినవేవొ ϟ మీకువేతు
ఎరువుసొమ్ములు తేఁగ ϟ పరువు పోవునుగదా
నీకు తెలియనిదేమి ϟ నిఖిల జగతి
నాయింట నడుగిడు ϟ నాల్గుచేతులసామి
యనఁగ నవ్వెదరయ్య ϟ యపుడెవారు

తే॥గీ॥ ఓరచూపును జూడక ϟ యోర్చుకొనుము
నేరమెంచక ననుకను ϟ గారవించి
రమ్ము రమ్మయ్య మణిమంది ϟ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ϟ పంతమేల. 24

సీ॥ మేమంత వచ్చిన ϟ భామనీవొకతెవు
మరియాదలెట్లులు ϟ జరుపఁగలవు
అనుచు నడిగెదేని ϟ యానదిచెపుదు నా
పతియుబిడ్డలుగూడి ϟ పాదసేవ
మీయందఱకుఁ జేసి ϟ మీచేత దీవనల్
మేమంతపొంద మా ϟ మేలుగాను
శాంతంబుగావిను ϟ చక్కనిభావంబు
నామదినిండుగా ϟ నణఁగియుండె

తే॥గీ॥ ఎపుడు వచ్చెదవంచు నే ϟ నెదురుసూతు
కదలిరావేల యిఁకనైన ϟ కపటముడిగి

రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 25

సీ॥ దేవదేవేశనిన్ ƒ దీననై వేడుచు
నామొర వినసీకు ƒ న్యాయమూను
మానవులెల్లరు ƒ కానఁజాలని యట్టి
పరమాత్మ నాయింట ƒ పదమునిడఁగ
నాకండ్లతోఁ జూచి ƒ నాజన్మ తరియింప
స్వార్థంబు కోరిన ƒ సతియుఁ నోదు
సాటిమానవులెల్ల ƒ సంతోషచిత్తులై
నిన్నుఁజూచినఁ గదా ƒ నిండునాకు

తే॥గీ॥ మాటనీయుము నాతండ్రి ƒ మనసులోని
కోర్కెఁ జెప్పితి నేనని ƒ కోపపడక
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 62

సీ॥ కథలెన్నొ కలవయ్య ƒ కల్పనల్ నీమీద
కవులెట్లు వ్రాసిరో ƒ కానఁజాల
మూఢజనులు నిన్ను ƒ గాఢంబుగా నంద్రు
దొంగవు వ్యభిచారి ƒ దొరవటంచు
అవియన్ని నిజమైన ƒ దివినుండి దిగవద్దు
నిన్నుఁ బూజించెదు ƒ నేర్పులేదు

రక్తమాంసపు దేహ ǂ రమణినే నేనైన
మనసు నిబ్బరమున్న ǂ మగువ నేను

తే॥గీ॥ తప్పులను బాపి మదినిల్పు ǂ ధర్మచింత
తెలివి లేనట్టి ప్రజలకు ǂ తెలియఁ జెప్ప
రమ్ము రమ్మయ్య మణిమంది ǂ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ǂ పంత మేల. 27

సీ॥ నేను జెప్పెడు మాట ǂ నిజమని నమ్మరు
లోకులెల్లరు మాల ǂ కాకులౌచు
త్రాగి జూదముకూడ ǂ తప్పు కాదెదవంచు
నింద మోపెద రింక ǂ నిక్కముగను
జాలంబు చేయకు ǂ చాలు బెట్టును వీడి
పరుగు పరువున వచ్చి ǂ ప్రజల నేలు
మరచిపోతిని సుమా ǂ పరుగున రాపద్దు
వేష భాషలతోనె ǂ వేగ రమ్ము

తే॥గీ॥ డాబులేకున్న నెవ్వరు ǂ డాయరయ్య
లెక్క చేయరు నీమాట ǂ నొక్కటైన
రమ్ము రమ్మయ్య మణిమంది ǂ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ǂ పంత మేల. 28

సీ॥ మణియమ్మ పిలిచెను ǂ మరిమరి నన్నె మొ
తన జీవితంబాక ǂ దరినిఁ జేర్చ

అనుచుఁ దలఁతువేని ? నదియును సరికాదు
సత్కర్మయను నౌక ? సరిగ నెక్కి
కర్మలన్నియు దాటి ? కడకునీదరిచేర
కష్టమైనను గాని ? నష్టపడను
కష్టంబుదీర్పంగఁ ? గాంత పిల్చెనటంచుఁ
గలనైన నెప్పుడు ? తలఁచవద్దు

తే॥గీ॥ తండ్రికైనను లోకాల ? తండ్రికైన
మనసు విప్పుచు చెప్పెదు ? మగువ కాను
రమ్ము రమ్మయ్య మణిమంది ? రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ? పంతమేల. 29

సీ॥ కలియుగప్రజలెల్లఁ ? గట్టుబాటులఁదప్పి
ధర్మమార్గమునుండి ? తరలిరయ్య
తప్పని చెప్పంగ ? చెప్పులుదీతురు
పాపమన్నది లేదు ? భయము లేదు
వారిజాక్షుఁడె కాక ? దారిజూపెడు వాడు
మరియెవ్వరని నేను ? మదిని తలచి
నిన్నుపిలుచనన్ను ? నీవెవ్వరనుచును
అడిగెదవని నేను ? నడియుసెపితి

తే॥గీ॥ అంతియేగాని సంసార ? వంతలెల్ల
చెప్పిరక్షింపఁబిల్చిన ? చేడెగాను

రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 30

సీ॥ వైకుంఠవాసుండు వచ్చును రండన
పదుగురు చేరరా పందిరేయ
ఆదిలక్ష్మియు వచ్చు ననుచుం దెల్పగ నేను
అలికియు ముగ్గుంతు రతివలంత
గణపతి వచ్చును కదలి రండనగానె
చిన్నారిబాలలు చేరరార
పరమాత్మ కిత్తును పాలను తెండన
పాలకుండల నెన్నొ పట్టితేర

తే॥గీ॥ పండ్లు తెమ్మని చెప్పంగ పరుగు లిడుచు
నంగడులనున్న వన్నియు నపుడె తేర
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 31

సీ॥ నోటిమాటను జెప్ప పాటిసేయరుసుమా
కలియుగప్రజలన్న ఘనులుగారె
చిత్రగుప్తునితోడ చిట్టాను తెమ్మను
ఎవరివి వారికే యెరుకచేయ
ఇదియేమి పనులని విసుగుజెందకుసుమా
నీవుగాకున్నను నిపుణులెవరు

సరిచేయగలరయ్య ƒ సమమైన బుద్ధితో
ధర్మంబుస్థాపించు ƒ ధన్యులెవరు

తే॥గీ కష్టపడవద్దు నాప్రక్క ƒ ఘడియనీవు
నిలిచియుండిన నేఁజేతు ƒ నీదుపనులు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 32

సీ॥ కాలంబు మారెను ƒ జాలంబుచేయక
ధర్మంబు పాలింప ƒ తరలిరమ్ము
విసిగించితిని నేను ƒ కసరుకొనకుము నీ
కరుణాయుండిననాకు ƒ కల్గుసుఖము
అజ్ఞను ప్రక్కన ƒ నండగా నీవుండి
జరుగుకార్యములన్ని ƒ జరుపలేద
యట్టివిధముగానె ƒ గట్టిగా నాప్రక్క
నిలిచియుండినఁజాలు ƒ నేనెసేతు

తే॥గీ॥ యతివనని మాటఁత్రోయక ƒ యబలననక
యాత్మరూపంబు సమమను ƒ నాదిమూర్తి
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 33

సీ॥ నాప్రక్కనీవుండ ƒ నరులకునేఁజెప్ప
నౌనౌను ననుచున ƒ న్నాదరింత్రు

దైవబలము లేక ⁂ ధరలోన నేపనుల్
జరుపంగఁ జాలరు ⁂ జయముగాను
నామదియందున ⁂ నదివలెఁ బ్రవహించె
వరపవిత్రంబను ⁂ వరదయొకటి
కట్టువారలు లేరు ⁂ పట్టువారలు లేరు
పొంగి పోవుచునుండె ⁂ నింగివరకుఁ

తే॥గీ॥ గట్టు కట్టంగఁ జాలిన ⁂ ఘనుఁడ వీవు
నదిని బాటించ లోకాలు ⁂ పదిల మొంద
రమ్ము రమ్మయ్య మణిమంది ⁂ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ⁂ పంత మేల. 34

సీ॥ నీవు చేసెడి పనుల్ ⁂ నేచేసి పెట్టుదును
శ్రమ పెట్టఁ జాలను ⁂ శాంతమూర్తి
తండ్రిగా నీవుండు ⁂ తగు పీఠమందున
నీపాదముల చెంత ⁂ నిలువబడియు
నీమాటగాఁ జెప్ప ⁂ నీతల నూపుము
అదియె చాలును నాకు ⁂ నధిక మేల
మానవులందున ⁂ మర్మంబుఁ జూపెదు
దేవతల్ లోపాలఁ ⁂ దెలుపవలయు

తే॥గీ॥ లోకజననీకుండ భేదంబు నీకు తగదు
కర్మలన్నియు బాపినన్ గామకోరకు
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 35

సీ॥ గణపతి పనులను కట్టువారే లేరు
ముందె మ్రొక్కకయున్న చిందులేసి
ఎంతేసి పనులైన పంతాన చెరచును
వానినెదుర్కొను వారలెవరు
అమ్మతోఁ జెప్పిన నయ్యతో చెప్పిన
అల్లరి విడచునా యలుకవచ్చు
పిల్లలఁ బెంచుచే తల్లులు బరువని
కటకటంబడునట్టి కాలమందు

తే॥గీ॥ బొజ్జగణపతికెవ్వరు బూరెగారె
వండిపెడుదురు చెప్పు మీ దండిగాను
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 36

సీ॥ మన్మథుతప్పక మందలించుము సుమా
మర్యాదయన్నను మరచియుంటె
పార్వతీనాథుండు భస్మంబుచేయంగ
రతికంటి నీటిచే బ్రతికియుండి

నాతుల సుందర § కోకిలాగున దూకి
విసుచు బాణాలకు § విలువలేదు
మొత్తనివారల § మొత్తుచుండెనుగాని
వీరనారులుగల § భారతాన

తే॥గీ॥ మరల భస్మంబె యూడెనా § తిరుగులేదు
మితముగానుండి యికమీద § బ్రతుకుమనుము
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. ౩౭

సీ॥ బీగాలువేసి కు § బేరుండుదాచును
సాధనరాసుల § యర్థమేమి
మాకున్న కొద్దిలో § మీకిచ్చికొలుతుము
మీ కుబేరుండట్లు § మాకునీడు
మాపాలనమువచ్చె § మా సంఖ్య పెరిగెను
ద్రవ్యంబుచాలదు § ధరలు పెరిగె
ప్రభువులు ప్రజలందు § పావలాల్ బేడలు
ప్రోగుచేతురుగాని § పొంకముగను

తే॥గీ॥ దాడిచేయంగ మీమీద § ధైర్యమేది
భరత దేశంబునందట్టి § పట్టుదప్పె
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల. ౩౮

సీ॥ రఘుమహారాజప్పు  రణభేరి మ్రోగించ
నాకుబేరుండంత  నడలిపోయి
ధనరాశి కురిపించి  యినవంశ తిలకుని
కోశగృహంబులో  కొల్లచేసె
పిరికివారినిఁ జేసి  దరికిరానీయక
మావారి నాడించ  మంచిదాన
కలిమాయ చేవీరు  ఘనత కెక్కరుగాని
పౌరుషహీనులే  భరతజనులు

తే॥గీ॥ అట్టి కలిమాయ తరుమంగ  గట్టివాడ
వీవెగాకున్న నేర్పరు  లెవర యనుచు
రమ్ము రమ్మయ్య మణిమంది  రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ  పంతమేల. 39

సీ॥ మాపూర్వులందఱు  నేప్రొద్దు మీకును
క్రతువులతోడను  ఘనతగాను
పూజలుచేయుచు  పుణ్యంబుకోరకని
భక్తితో మీకాళ్ళ  పట్టలేద
ఇప్పటినేరాల  నెంచెద రేగాని
మావారుచేసిన  మంచిగనరు
మానవులనునెల్ల  మంత్రముగ్ధులఁ జేసి
తోలుబొమ్మలలాగు  తోలుచుండ

తే॥గీ॥ దేవతలయందె కపటంపు । భావమూఁడ
నరులసంగతి యననేల । న్యాయపరుఁడ
రమ్ము రమ్మయ్య మణిమంది । రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ । పంతమేల. 40

సీ॥ కోటిలోనొక్కఁడు । కూటిపూటాశనువీడి
తపముచేసెదనంచు । తలఁచుకొనియు
సంసారమునుగోసి । సంపాదననువీడి
అన్నియువిడిచి స । న్యాసియగుచు
దట్టంపుటడవిలో । ధైర్యంబుతోఁజొచ్చి
ధ్యానంబుదాల్చియు । తపముసేయ
నాయింద్రుఁడంపును । నప్సరోరత్నాల
మేనకోర్వశులను । మానినులను

తే॥గీ॥ పెద్దతరహాలు గలవయ్య । పెద్దలకును
సమముగాచెప్పనీనోట । సత్యమరసి
రమ్ము రమ్మయ్య మణిమంది । రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ । పంతమేల. 41

సీ॥ ఇంక నీకోడలు । బింకాలుదెల్పెద
యాబ్రహ్మ పత్నిదా । యాగడంబు
వంటయిల్ విడువదు । యొంటరిగానున్న
నొప్పకయొకపని । నొప్పఁజెప్పు

అయిదేండ్ల బిడ్డను గీ నయ్యవారదలించి
చెవిబట్టికొట్టుచు గీ చెప్పరీతి
బెదరించి లాలించి గీ కదలించిననన్నె మొ
కలముఁబట్టించుచు గీ కనులజూచు

తే॥గీ॥ తప్పులున్నను చెప్పదు గీ దాపుఁజేరి
కవులునప్పర చెప్పమా గీ కరుణతోడ
రమ్ము రమ్మయ్య మణిమంది గీ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ గీ పంతమేల. 42

సీ॥ ఎప్పుడు చూచిన గీ నిక్కడెయుండును
అత్తకు మామకు గీ నదరకొనదు
పదినిముసంబులు గీ పతిసేవఁజేయదు
నీసుతుండా బ్రహ్మ గీ నిండుకుండ
నాతరపుననీవు గీ న్యాయంబునడిగిన
నెఱజాణతో నీవు గీ నెగ్గలేవు
నీయెదుటనె పెట్టి గీ నిజముఁజెప్పించెద
నాతిపెట్టుచునుండు గీ నలఁతలన్ని

తే॥గీ॥ సర్వవిద్యలు నేర్చిన గీ సఖియలుండ
ఏమి తెలియని నన్ బట్టి గీ యేపుచుండె
రమ్ము రమ్మయ్య మణిమంది గీ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ గీ పంతమేల. 43

సీ॥ సీపత్ని నాతల్లి ƒ నిండైనయిల్లాలు
ఆలచ్చిసంగతి యరసిచూడు
ఈట్టునవచ్చును ƒ దూగుటుయ్యాలనూపు
ఓట్టున నంతలో ƒ చెదరిపోవు
తెలివితక్కువవారు ƒ కలవంటి దనుకొన
విట్టవీగుచునుంద్రు ƒ నెట్టితనము
ఆయహంకారంబు ƒ నతివ తానోర్చునాకె
యంతవచ్చినత్రోవ ƒ నామెపోవు

తే॥గీ॥ ఇట్టిచిక్కులఁబెట్టెడు ƒ నిందిరమ్మ
ఇంకనాదరినుండెడు ƒ విధముఁజెపుదు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 44

సీ॥ నేనన్న నిష్టంబు ƒ నీప్రాణసతికవి
నిజముకాదోయామె ƒ నీకెజెప్ప
లక్ష్మివారమునుండి ƒ లక్ష్యంబుగానుండు
శుక్రవారపురాత్రి ƒ సొంపుజూపు
నీడగానావెంట ƒ జోడుగానుండును
పుటికనాచేమండఁ ƒ బూలుగోయు
నగలతో నగరుతో ƒ సొగసైనపూలతో
పూజించినాతల్లి ƒ పొంగుచుండు

తే॥గీ॥ ఇట్టిచిత్రంబులెన్నియో ƒ యింకనుండె
నీవుగమనించనాతల్లి ƒ భావములను
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 45

సీ॥ ఒకశుక్రవారాన ƒ నొప్పుగాఁబూజించి
తలుపులుమూయకే ƒ యలుపుతోడ!
పడుకొన్న నాకంత ƒ పట్టైననిదురపై
వనితయెవ్వరోనన్ను ƒ వచ్చిలేపి
వాకిలితెరచి యే ƒ భామనిద్రించెదే!
యనిలేపనేనంత ƒ నామెఁజూచి
తాంబూలమిచ్చెద ƒ తల్లిగైకొనుమన్న
పుష్పాలియ్యవయంచు ƒ నవ్వుచిట్లు
గేలుకావలయుంచి ƒ గోటుగాననుగాంచి
మరియాదచేసెదె ƒ మగువయనిన

తే॥గీ॥ వీధిలోనికిఁజోరవతో ƒ వెడలనైతి
నన్నుక్షమియించుమిదియొక ƒ న్యాయమంటి
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 46

సీ॥ నీసతిలోనున్న ƒ నిజమైనగుణములఁ
గనిపెట్టఁజాలెదు ƒ ఘనులు లేరు

స్థిరముగానుండదు | సిరియని మానవుల్
కథలుగాఁజెప్పుట | కలముగాని
నిజముగానాతల్లి | నివసించుయోగ్యత
మదినెంచిచూచిన | మాకెలేదు
సత్యంబుశీలంబు | సరిహద్దుదాటని
వారలచెంతని | వాసమౌను

తే॥గీ॥ చేయు పైచూపులకునామె | చెడ్డవారి
కడనెయున్నట్లు దోచును | కలుషహారి
రమ్మ రమ్మయ్య మణిమంది | రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ | పంతమేల. 47

సీ॥ జూదరుల్ చెంత నే | జోడుగానుండును
త్రాగువారలచెంతఁ | దరలకుండు
వ్యభిచారజనముల | వరుసనె నిలబడు
ననుదోచుచుండును | నామెతీరు.
పూర్వజన్మంబులఁ | బూజఁజేసిరిగాన
వారిని వదలెడు | వసతిలేక
ఏవగించుచునుండు | నెపుడెప్పుడోడునా
యనిచిందులేయుచు | నర్థనిమిష

తే॥గీ॥ మొక్క యేఁడుగ నీసతి ¶ యుండలేక
తలఁచుచుండును తత్వంబు ¶ దెలియచేయ
రమ్ము రమ్మయ్య మణిమంది ¶ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ¶ పంతమేల. 48

సీ॥ శుచియన నింటిని ¶ శుద్ధి చేయుటకాదు
చిత్తంబు కలుషంబు ¶ చిమ్మవలయు
గొప్పనబంగారు ¶ గొలుసులేయుటగాదు
మదికివిజ్ఞానంబు ¶ కుదురవలయు
విద్యనేర్చినమాత్ర ¶ వెలనేదిదానిచే
చిత్తశుద్ధియులేక ¶ చెత్తయగును
ద్రవ్యముండినమాత్ర ¶ ధనవంతులందురు
సజ్జనత్వములేక ¶ చౌకగాదె

తే॥గీ॥ కలిమిలేములు కావయ్య ¶ ఘనుఁడుగాఁగ
ఆత్మతేజస్సు వెలుగంగ ¶ నధికుఁడగును
రమ్ము రమ్మయ్య మణిమంది ¶ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ¶ పంతమేల. 49

సీ॥ ఇంకొక్కసంగతి ¶ నింపుగా వినవయ్య
నీసతిమాయలు ¶ నీకె తెలియు
ఒక్కరాతిరినేను ¶ నిక్కంబయనుకొంటి
నింటిలోబియ్యంబు ¶ నిండుకొనఁగ

ఎక్కువవాడగా ƒ నింతలోనయిపోయె
పూనుకొందును నింక ƒ పొదుపు సేయ
అనుచు నేనిద్రించ ƒ నంతటంగన్నట్టి
దృశ్యంబు చెప్పెద ƒ దేవదేవ

తే॥గీ॥ కల్లలాడెడు పడఁతిని ƒ గానువినుము
సంశయంబైన నామెయే ƒ సాక్ష్యమిచ్చు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 50

సీ॥ గుంపుగుంపుగజనుల్ ƒ గుమ్మాలుదాటుచు
నన్నంబునడిగిరి ƒ నన్నుఁజూచి
వీరందరికినేను ƒ నేరీతిఁబెట్టుదు
నిన్ననే బియ్యంబు ƒ నిండుకొనియె
లేదనిచెప్పంగ ƒ రాదుమాటయునాకు
అనుకొనినేనప్డు ƒ నెనుకదిరుగ
పెద్దగుండిగవార్చి ƒ పెట్టినదృశ్యంబు
నాకండ్లకగుపడ ƒ నఁగినేను

తే॥గీ॥ పైకినెత్తియు వడ్డింప ƒ పదిలముగను
ఒకఁడెతినెనంత యన్నంబు ƒ నొప్పుగాను
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 51

సీ॥ కలవరపడుచు నే ƒ కండ్లుద్రిప్పుచుచూడ
మరియొకగుండిగ ƒ సరిగనుండె
అది తెచ్చిపెట్టంగ ƒ నంతయు తినెనయ్యొ
మరియొక వ్యక్తియొ ƒ మందునేను
ఎన్నియెత్తుచునున్న ƒ నన్నివారుపులుండె
వాఁడొకవ్యక్తికే ƒ వచ్చుచుండె
తెల్లవారువరకు ƒ తిరుగుచునడ్డింప
నలుపుదోఁచగనొడల్ ƒ పులకరించె

తే॥గీ॥ తెరువచూచియు నాకండ్ల ƒ తెరువజాల
నొక్కిపట్టినలాగున ƒ నొప్పిపుట్టె
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 52

సీ॥ కండ్లుబోయిననంచు ƒ కలవరపడినేను
వ్రేళ్ళతోఱెప్పలు ƒ విప్పిలాఁగ
వీడకొద్దిగచూపు ƒ నీడగానానెను
నన్నుచూచుచునున్న ƒ నాతియొకతె
నాల్గుచేతులుగల్గి ƒ నగుమోముతోనుండి
కనువిప్పినావైపె ƒ గాంచుచుండె
సుదతి నీమనసులో ƒ చుల్కదనంబేల
నేనుండనీయింట ƒ నేమికోరుదువ

తే॥గీ॥ అనుచు హాస్యముతోఁ జూచు ƒ నతివఁ గాంచి
సిగ్గుపడితిని నేనప్పు ƒ సిరిరొ యామె
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య ƒ పరమాత్మ ƒ పంతమేల. 53

సీ॥ లక్ష్మితిరుగుచుండె ƒ లక్ష్యంబునాకాయె
అయినను నేనేమి ƒ యనుగలేను
నాపూర్వజన్మాన ƒ నాకర్మయనునట్టి
వృక్షంబుఫలములే ƒ బిక్షునాకు
యాచించనెఱుగని ƒ యతివనేననియెంచి
మర్మంబుగానన్ను ƒ మాయజేయు
గట్టిమర్యాదను ƒ ఘనతగానేఁజేయ
నడిగినవెల్లను ƒ నామెయిచ్చు

తే॥గీ॥ నడుగునబలనుగానని ƒ యతివయలిగి
చేరునొకమూల కోపాన ƒ నీరజాక్షి
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 54

సీ॥ నేఁజేయగలనేమొ ƒ నీభార్యమర్యాద
నాతనువెడలంగఁ ƒ జేతురెవరు
అపుడు కోపమువచ్చి ƒ యామెతొలఁగనేని
ఇల్లుచూడఁగనంత ƒ గుల్లకాదె

ఇపుడేమొ వచ్చిన ƒ నింటిలోనందరు
సోమరితనమున ƒ పామరమున
చదువుసంధ్యలురాక ƒ శ్రమపడుటెరుగక
సుకుమారులై యుండి ƒ సుఖముమరిగి

తే॥గీ॥ ధర్మమార్గంబు మరచిన ƒ తరుణమందు
లచ్చివెడలినగతియేమి ƒ బిచ్చగాక
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 55

సీ॥ కష్టార్జితంబౌక ƒ కళయంత్రము భువిలోన
యాచించుధనమది ƒ యధమమంత్రము
నామీదలచ్చికి ƒ ననురాగముండిన
రావచ్చు నికమీద ƒ బోవదేని
మడిగట్టినడిగట్టి ƒ మర్యాదచేయుట
నావల్లగాదని ƒ దేవచెప్ప
పిల్లలుగలయిల్లు ƒ కల్లోలముగనుండు
చిరచిరవలదని ƒ సిరికిఁజెప్ప

తే॥గీ॥ ఇన్నిచిక్కులు నాకేల ƒ యింతినాకు
సర్వసౌభాగ్య కళలీయ ƒ చాలునయ్య
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 56

సీ॥ ఇంకనొక్కటివిను ƒ నిదియుచెప్పెదనీకు
ఒకరాత్రి జరిగిన ƒ యొక్కవింత
భిల్లరూపంబుతో ƒ మెల్లగవచ్చిరి
దంపతులిద్దరు ƒ దయనుజూప
ఎపుడొచూచినయట్టు ƒ లెదలోనతో చంగ
నిర్ఘాంతపడినేను ƒ నిలునఁబడితి
చిరునవ్వుతోనున్న ƒ చిగురుబోడినిచూచి
యెంతచక్కనిదాన ƒ వింతినీవు

తే॥గీ॥ పట్టుచీరగట్టి నగల ƒ పెట్టుకొన్న
నెంతయందాననుందువో ƒ నింతియంటి
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 57

సీ॥ అదివిని నవ్వెను ƒ యాతన్విపతియైన
భిల్లరూపుండప్డు ƒ మెల్లగాను
ఈసారిచూడమ్మ ƒ యీతన్వియందంబు
అనినన్నుచూచుచు ƒ నతఁడుపలికె
తలయెత్తిచూడంగ ƒ దంపతులిద్దరు
వికృతరూపులఁ గాంచు ƒ పింతదోప
ముడుతలుపడియును ƒ ముసలివారైరప్డె
చూచుచుండగవారి ƒ సొంపుపోవ

తే॥గీ॥ ఏమిచిత్రంబొయనుచు నే ‡ నెంచిమదిని
బొమ్మలాగుననిలుచుంటి ‡ నమ్మనీవు
రమ్ము రమ్మయ్య మణిమంది ‡ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ‡ పంతమేల. 58

సీ॥ ఆమాయరూపుండొ ‡ యేమాటయనక యె
చేతిలోశూలంబు ‡ చేర్చిపట్టి
యింటిచుట్టుననున్న ‡ యెండుటాకులనన్ని
తుడుచుచు గెంటుచు ‡ తుక్కునంత
నొకచోటచేర్చంగ ‡ నువిదతటాలున
నంట్లగిన్నెలబైట ‡ నపుడువేయ
నోటమాటయురాక ‡ సూటిగాచూచుచు
నెట్టకేలకునంటి ‡ నింతితోడ

తే॥గీ॥ పడతి పనిచేయువారుండె ‡ పరులుమీరు
వచ్చిమాయింట పనిచేయ ‡ వలదెయంటి
రమ్ము రమ్మయ్య మణిమంది ‡ రానికనిన
పలుక వేలయ్య పరమాత్మ ‡ పంతమేల. 59

సీ॥ అనినేనునుడువంగ ‡ యాతన్విపతియప్డు
చిరునవ్వుతోఁజూచె ‡ చేడెవంక
ముసిముసినవ్వుతో ‡ గుసగుసలాడుచు
నతఁడనెననుగాంచి ‡ యాదరమున

ఓయమ్మ నీయింట ƒ నోర్పుతో పనిచేయ
మేమిద్దరుందుము ƒ మీకుఁ దోడు
నీకుతోచినదీయ ƒ మాక దెచ్చాలమ్మ
యనియతఁ డనఁగానె ƒ యతివనవ్వి

తే॥గీ॥ సకలకార్యంబులను జేతు ƒ సఖియయనుచు
మధురభాషలనాడిన ƒ మగువయెవరొ
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 60

సీ॥ మఱునాడు నాకంత ƒ మతిబోయినట్లుండె
నిన్న వచ్చిన వార్ల ƒ నిర్ణయింప
కైలాసవాసులే ƒ కాని యన్యులుగారు
పాపమేయని పరి ƒ తాపపడితి
తల్లిదండ్రుల సేవ ƒ లెల్ల సేయగలేదు
అత్తమామల సేవ ƒ యసలె లేదు
పట్టుగా చెప్పంగ ƒ పతిసేవగూడను
గట్టిగ చేసిన ƒ కాంతగాను

తే॥గీ॥ అట్టిపడఁతిని దేవతల్ ƒ గట్టిబుణము
నెట్లుదీర్చెద! యో దేవ ƒ యెంచి చెపుమ
రమ్మ రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 61

సీ॥ ఒకనాటిరాత్రిలో § నొకవింతఁ జూచితి
అదియుఁజెప్పెద నీకు § నాలకించు
సుడిగాలివచ్చినన్ § చుట్టబెట్టుకపోయె
నంతరిక్షమునందు § వింతగాను
నొకచోటనేనాగి § వికలచిత్తంబుతో
దేవాలయంబును § దేవగాంచ
నింతలోనాగాలి § యెంతయోవిసరున
మరియొకచోఁజేర్చె § మరలనేను
కన్నులువిప్పుచు § కంటిచిత్రంబును
మరియొకదేవతా § మండపంబు

తే॥గీ॥ ఇట్లుచూచిన వెన్నియో § యెంచలేను
కనులుదెరచితి కాకులు § కావుమనఁగ
రమ్ము రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ § పంతమేల, 62

సీ॥ వింతపైవింతలు § వినుము నేఁజెప్పెద
నాలించియర్థంబు § నరసిచెప్పు
బాలింతనై యుండి § పసిబిడ్డప్రక్కలో
పడుకొనియుంటిని § భద్రముగను
కనులుమూసినవేళ § కంటిని స్వప్నంబు
అద్భుతంబైనట్టి § యడవిలోన

పరుగెత్తుచుంటిని ⸗ పదములుతడబడ
నడుగులువేయంగ ⸗ నడవిలోని

తే॥గీ॥ పులులుసింహాదులెన్నియో ⸗ ముందుఁజేరి
యడ్డుపెట్టంగ నేనంత ⸗ నలసిపోతి
రమ్ము రమ్మయ్య మణిమంది ⸗ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ⸗ పంత మేల. 63

సీ॥ ఎన్నియడ్డాలైన ⸗ నెంతయోర్చి నే
ముందు కేపోతిని ⸗ మూలపురుష
గాలివానయుఁగూడ ⸗ ధూళితో రేగెను
దారికన్పించక ⸗ తల్లడిలితి
భారకునొక పులి ⸗ పైపైనఁబడరాఁగ
గుండెలు దడదడ ⸗ కొట్టుకొనఁగ
నోరుల తెరువంగ : బోరునసింహాలు
కండ్లమూసితినప్డు ⸗ కాంచలేక
బలహీననయి నేను ⸗ పడిపోవుసమయాన
మాయమైపోవంగ ⸗ మగువయొక తె

తే॥గీ॥ రెండుచేతులచాపినన్ ⸗ నిండుకరుణ
గౌగలించెను నదియేమి ⸗ కలయొ సెపుమ
రమ్ము రమ్మయ్య మణిమంది ⸗ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ⸗ పంత మేల. 64

సీ॥ స్పృహలేని నన్నప్డు ౯ చుట్టుముట్టడివేసి
చలువకమ్మనునంచు ౯ కలువరమున
మావారు పెట్టిరి ౯ మంటతోకుంపటి
కాళ్ళుచేతులుకాచి ౯ కడకువారు
వెల్లుల్లిరేఖల ౯ పొల్లును కలిపియు
పచ్చని పసుపుతో ౯ పాదములకు
రుద్దుచునుండిరి ౯ బద్దకమునుఁబోయె
కన్గవతో వారిఁ ౯ గాంచియుంటి

తే॥గీ॥ దీనియర్థంబుచెప్పుమీా ౯ తేటగాను
నాదుభావంబుచెప్పెద ౯ నవ్వవేని
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 65

సీ॥ పదనాకండేండ్లాయె ౯ పరమాత్మ కలవచ్చి
నాకైనయర్థంబు ౯ నీకుఁజెపుదు
సంసారమనియేఁడు ౯ సాంద్రంపుటడివిలో
పులులసింహాలను ౯ బోలియుండు
కష్టంబులెన్నియో ౯ కల్గునీకనుచును
తెలియజెప్పెనునాదు ౯ చెలియ యొకతె
అలసిపోయినవేళ ౯ నతివతానేవచ్చి
యామెకౌగిలిలోన ౯ నణచినైచె

తే॥గీ॥ నవ్వువచ్చెన? నాభావ ꠗ నలనుగాంచి!
నీవుచెప్పంగ విందులే ꠗ నిజమదేదొ?
రమ్ము రమ్మయ్య మణిమంది ꠗ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ꠗ పంతమేల. 66

సీ॥ వేరొకసంగతి ꠗ వింతగాఁజరిగెను
విసుగుచెందకవీవు ꠗ వినుమువేని
పదునాలుగేండ్లాయె ꠗ పతియేగియుండిరి
వైద్యంబుయుద్ధాన ꠗ వనరఁజేయ
యుద్ధంపు ఘోరంబు ꠗ లున్నవున్నట్లుగా
నాయాంధ్రప్రభయప్డె ꠗ యందఁజేయ
జాబులురాకున్న ꠗ గాబరాపడినేను
నొకరాత్రి సమయాన ꠗ నొంటిగాను

తే॥గీ॥ పండుకొన్నను నిద్దుర ꠗ పట్టదాయె
అపుడు చూచినదృశ్యంబు ꠗ చెపుదునేను
రమ్ము రమ్మయ్య మణిమంది ꠗ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ꠗ పంతమేల. 67

సీ॥ ప్రక్కగదినినున్న ꠗ చుక్కంటిదీపంబు
నేనున్నగదియందు ꠗ కానుపించె
కనులనుతెరచియే ꠗ గాంచుచుంటినినేను
కలకాదు సుమ్మయ్య ꠗ కమలనయన

కవులువర్ణించెను ఘనశక్తిరూపంబు
కాళ్ళకు గజ్జెలు ఘల్లుమనఁగ
ఎత్తైనయారూపు క్రొత్తగానుండంగ
నాకండ్లయెదుటనే నాతినిలిచి
మగువ చింతించకు మరిరేపు జాబందు
నీకఁబోదునేనని యింతియనుచు

తే॥గీ॥ చేతులెత్తంగనామెయు చేతులెత్తి
మాయమయ్యెను ఘడియలో మధువినోధి
రమ్ము రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 68

సీ॥ ఇఁకనొక్కమారునే నింపుగాఁజూచితి
ఈశక్తి రూపంబు వింతగాను
నాపెద్దబిడ్డప్పు నాప్రక్కలోనుండ
చంటిబిడ్డగనున్న సమయమందు
ప్రక్కలోనున్నట్టి పసిబిడ్డనెత్తియు
చేతులుకాళ్ళను చీల్చివైచి
నాయెదురుగతిని నామోముఁజూచుచు
నదరదుబెదరదు నాతియపుడు

తే॥గీ॥ ఇట్టిఘోరాలనెన్నియో యింతిచేసె
తెలియఁజెప్పెదనీచెంత తేటగాను

రమ్మ రమ్మయ్య మణిమంది ర రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ర పంత మేల. 69

సీ॥ ఇంకొక బిడ్డను ర నింతితాపడవై చె
లోతుగానీరున్న ర లోయయందు
గప్పునదూకినే ర చప్పున దేచ్చితి
అడుగువఱకుబోయి ర జడియకుండ
కొన్నాళ్ళక్రిందట ర కొమ్మతావచ్చెను
అప్సరసనుబోలు ర నందముగను
నా వెంటరమ్మని ర నాతినన్ బిలువంగ
చంటిబిడ్డనువీడ్చి ర యెంటరైగాను

తే॥గీ॥ ఎట్లువత్తును చెప్పుమా ర యింతియనిన
నామె చేసిన దౌర్జన్య ర మదియువినుము
రమ్మ రమ్మయ్య మణిమంది ర రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ర పంత మేల. 70

సీ॥ చేతిబిడ్డనులాగి ర చేజెకోపముతోడ
విసవిసదూకుచు ర విసరివేసె
మరునాడు లేవంగ ర జ్వరముతో నుండెను
కన్నులు తెరువదు ర కదలదాయె
పాలనిచ్చెదనని ర బాలనోటిని బెట్ట
నా ర్తితో నద్దాని ర నందుకొనదు

అప్పుడువచ్చెను కోప | మతివమీాదనునాకు
నెన్నియంటినో నేను | నెంచలేను

తే॥గీ॥ దాచకుండంగఁజెప్పెద | దానవారి
తప్పునాదనిచెప్పిన | నొప్పుకొందు
రమ్ము రమ్మయ్య మణిమంది | రానికనిన
పలుకవేలయ్య పరమాత్మ | పంతమేల. 71

సీ॥ నాబిడ్డలందఱు | నీబిడ్డలేగార
మనసన్నదున్నదా | మగువనీకు
దేవతవానీవు | దెయ్యానివా లేక
క్రూరరాక్షసిబోలు | కొమ్మవేమొ
నీవేమిచేసిన | నే నొప్పుదునుగాని
పసివారియందేమి | కసియిదేల
గుమ్మంబునెక్కక | పొమ్మింకనీవని
యుద్రేకముగ నేను | నువిదననిన

తే॥గీ॥ కొంతకాలంబు రాదయ్యె | చెంతఁజేర
పొంచిపొంచియుతిరిగెడు | పొలతిఁగంటి
రమ్ము రమ్మయ్య మణిమంది | రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ | పంతమేల. 72

సీ॥ పెండ్లైనక్రొత్తలో | కండ్లకునగుపడ్డ
వింతయొక్కటి దాని | వినుమునీవు

తెల తెలవారెను ƒ తొలికోడికూసెను
కావుకావుమనుచు ƒ కాకులరచె
తెరచియుండెను ƒ తెరదీసికిటికీలు
గాలివచ్చుటకు గా ƒ గడియతీసి
మెలకువ వచ్చిన ƒ మెడయెత్తి చూచితి
కిటికికావలనుండి ƒ నటనగాను

తే॥గీ॥ చూచుచుండిన యువిదను ƒ జూచి నేను
గడబిడగ లేచి తలుపుల ƒ గడియదీయ
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ƒ పంత మేల. 73

సీ॥ అచ్చటిమెట్లను ƒ నతివదిగుచునుండె
వెంటనే బోవంగ ƒ గంటఁబడదు
గేటుతల్పుల నెల్లు ƒ దాటితావచ్చెను
నిద్రలోనుండంగ ƒ నెల్ల వారు
మూసినతలుపులు ƒ మూసినట్లుండెను
నాశ్చర్యముగ నేను ƒ నంత వెదకి
చెచ్చెరనాగది ƒ చేరెఁడు సమయాన
నాపతిమేల్కాంచి ƒ నన్నునడిగె

తే॥గీ॥ యెచటికరిగితివనగ స్త్రీ ƒ యెవరో తొంగి
చూచినట్లైన వెదకుచు ƒ చూడఁబోతి

రమ్మ రమ్మయ్య మణిమంది ౫ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౫ పంత మేల. 74

సీ॥ నలమహారాజును ౫ నలనాఁడు శనిపట్టి
పలుకష్టములకోర్చి ౫ పడినరీతి
ఆ హరిశ్చంద్రుని ౫ నంటుక విడువక
నక్షత్రకుఁడుబెట్టు ౫ నలఁతరీతి
లంకలోసీతమ్మ ౫ రాక్షసస్త్రీలచే
పడరాని కష్టాలు ౫ పడినరీతి
పలుఘోరరూపాల ౫ పడతిదర్శనమీయ
పడరాని కష్టముల్ ౫ పడితినేను

తే॥గీ॥ ఇట్టినాటకమాడెడు ౫ నింతియెవరో
యింకనోర్చెడు శక్తి నా ౫ కింత లేదు
రమ్మ రమ్మయ్య మణిమంది ౫ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౫ పంత మేల. 75

సీ॥ ఎన్నని చెప్పుదు ౫ కొన్నియే చెప్పితి
వింత లెన్నియొయుండె ౫ వినతిఁజేయ
సంశయంబైనచో ౫ చక్కఁగ వ్రాయును
చిత్రగుప్తుడుఁవాని ౫ చేతమీరు
చదివించి తరువాత ౫ పదిమందిలోనాకు
న్యాయంబు చెప్పుమీ ౫ యోయనంత

తప్పులుగలవేని ƒ తలవంచినీచేత
శిశునుబొందెద ƒ తత్క్షణంబె

తే॥గీ॥ వాయిదా వేసి ముందుకు ƒ వంతులేసి
జననమరణాలలోనన్ను ƒ జొనుపవద్దు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 76

సీ॥ ఒకసంశయంబుండె ƒ నొప్పగావినునీవు
కోపంబువద్దయా ƒ కూర్మరూప
మాభారతీయులు ƒ మహిమాన్వితుఁడవని
పూజించెదరునిన్ను ƒ బుద్ధరూప
మాధర్మ శాస్త్రాన ƒ మగువలకుండెను
కట్టుబాటులవెన్నొ ƒ చుట్టుముట్టి
నీపత్నికోడలు ƒ నిందందె తిరుగంగ
నేననుకొందును ƒ నిజముగాను

తే॥గీ॥ ఆదిమూర్తిని నాతని ƒ యనుఁగుసుతుని
బోలువారెవ్వరుందురీ ƒ భూమిననుచు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 77

సీ॥ అతివయేపనికైన ƒ నందందు తిరిగిన
మాయాంధ్రకీర్తికే ƒ మచ్చవచ్చు

పడతి వెళ్ళలఁబోవ ॥ పతియప్పుడదలించు
నిజమెఱుంగడుగాని ॥ నిందమోపు
తనుజూడగాడైన ॥ త్రాగుబోతైనను
సతికినీతులుసెప్ప ॥ సాహసించు
నిదిరెుుకధర్మమై ॥ యీలోకముననుండె
కొందఱియందున ॥ కొదువలేక

తే॥గీ॥ ఈ యధర్మంబు మాలోన ॥ నెన్నఁజాల
నాకుఁదోచినవిధమిది ॥ న్యాయమేదొ
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ॥ పంత మేల. 78

సీ॥ మాకవుల్ వర్ణింత్రు ॥ నీకాంత చేరిన
వలచివచ్చెనులచ్చి ॥ వాని ననుచు
పరుల చేఁబట్టిన ॥ పడతినినీవెట్లు
వక్షానదాల్చెదు ॥ పామరూప
దశరూపములదాల్చి ॥ ధర్మాలనిలిపిన
దైవము తెలియని ॥ ధర్మమేది
గడగడలాడును ॥ కల్గులోకాలన్ని
నిన్నుజూచిన మాత్ర ॥ నీరజాక్ష
యిటువంటి భర్తగా ॥ రిందిరమ్మకునుండ
పరులను జేరంగ ॥ పరువులెదె

తే॥గీ॥ స్వార్థమించుక లేని ప | రార్థమే మొ
తలపమాకది మనసుకు | తట్టదాయె
రమ్మ రమ్మయ్య మణిమంది | రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ | పంత మేల. 79

సీ॥ ఇంక నా సుతు గొప్ప | యింతినీకెట్టుల
తెలియునంచును నీవు | పలికె దేని
ఒక నాటి రాత్రిలో | చెక చెక వచ్చెను
నీకోడలావాణి | నేర్పుకత్తె
పరిచయ స్త్రీలాగ | పలుకులఁ జెప్పుచు
తెరవంక చూచుచు | నరయుచుండ
ఎవరు వారని నేను | నింతి నేనడుగంగ
నా నాథుఁడే యని | నాతి చెప్ప
ఇంటిలో మొగవార | లెవ్వరు లేరమ్మ
మాట్లాడ వారితో | మగువ యనిన

తే॥గీ॥ వేదవిదులందు గురువుల | వేత్తలందు
అతివ గోషాలు లేవని | యామె పలికె
రమ్మ రమ్మయ్య మణిమంది | రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ | పంత మేల. 80

సీ॥ అనుచుండ తెరతొల్గ | నా సందులో నుండి
చేతుల పుస్తకాల్ | చేర్చిపట్టి

నాల్గుమోములవాడు ౘ నాకంటబడియెను
చిటికెలోనతఁడప్పు ౘ చెదరిపోయె
కండ్లునల్పుచులేచి ౘ కడుమోదమందితి
కలలోనగూడను ౘ గడపదాటి
రానినీసుతుగాంచి ౘ లోనెంచితిని నేను
బలుగొప్పతరహాయె ౘ బ్రహ్మాదనుమ

తే॥గీ॥ బంధుదయమీకు మామీద ౘ ప్రబలియుండ
వచ్చుచుందురు మీరని ౘ మెచ్చుకొందు
రమ్ము రమ్మయ్య మణిమంది ౘ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ౘ పంతమేల. 81

సీ॥ మాసతీత్వముగన ౘ మీసతీమణులంత
భారతంబుకురాగ ౘ పాఁడియయ్యె
వెనుకజరిగినట్టి ౘ వింతనుమరచిరా
మాసతీ యనసూయ ౘ మహిమగాథ
నారదఋషితోను ౘ బీరాలుపల్కియు
నత్రిమహాఋషి ౘ యాశ్రమమున
కాలక్ష్మిపార్వతి ౘ యందాలవాణితో
వచ్చినెగ్గగలేక ౘ కచ్చిగట్టి

తే॥గీ॥ ముగురు మూర్తులనంపంగ ౘ ముద్దుగాను
బాలలనుచేసి యనుసూయ ౘ జోలపాడె

రమ్ము రమ్మయ్య మణిమంది ర్రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 82

సీ॥ అతిథిరూపంబుతో ననసూయనడిగిరి
యన్నంబు పెట్టమ్మ యాఁకలనుచు
పెట్టెదసమయాన దిట్టలు వీరంత
చీరవిప్పియుఁబెట్ట నారగింతు
మటుచేయకున్నను నారగించమటన్న
మగువతలచెనంత మనసునందు
పరమపాతివ్రత్య భామనునేనైన
వీరెల్లబాలురై వెలయుననుచు
చేతజలముఁబట్టి శిరములజల్లియు
బుజ్జిపాపలజేసి బొజ్జనింపె

తే॥గీ॥ చీరవిప్పియె పెట్టెను చేరదీసి
మాతృమూర్తిగనింతలో మరచినారె
రమ్ము రమ్మయ్య మణిమంది ర్రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ పంతమేల. 83

సీ॥ చిలిపినారదఋషి చెంగునతానేగి
మీభార్యలకుఁ జెప్పె మిమ్ముగూర్చి
అనసూయవడిలోన నబ్బాయిలైరమ్మ
మీనాథులనుచును మేలమాడ

కంగారు పడియష్ణు ౯ కలహాల పెద్దయా
నారదుసలహాను ౯ నాతులొంది
భూలోకముకువచ్చి ౯ పుణ్యంపుటనసూయ
పాదంబులను తాకి ౯ పతుల నడుగ

తే॥గీ॥ ఎవరిభర్తనువారలే ౯ యెత్తుడనంగ
నొకరినాథుని నొకరెత్తి ౯ యోడిరయ్య
రమ్ము రమ్మయ్య మణిమంది ౯ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ౯ పంతమేల. 84

సీ॥ మంత్రతంత్రము లేవి ౯ మాకు తెలియవైన
మా దేశనీతిలో ౯ మహిమలుండె
సూర్యునినిల్పిన ౯ సుమతియే సాక్ష్యంబు
పతిభక్తిలోనున్న ౯ పట్టు దెలియ
సత్యంబు తప్పని ౯ సత్యహరిశ్చంద్ర
గాధయే భారత ౯ ఘనత దెల్పు
మా దేశ వాసుల ౯ మంచినిపరికించి
దేవతల్ తిరుగుట ౯ తేటబడియె
భారతీయులతోటి ౯ బంధుత్వముండుట
మా ప్రాతకథలె ప్రా ౯ మాణికములు

తే॥గీ॥ అట్టిమైత్రిని నింకను ౯ గట్టిపఱచ
కంకణముదాల్చి రావయ్య ౯ కరుణతోడ

రమ్మ రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంతమేల. 85

సీ॥ దేవుండవీవని కావరమ్మంచును
నిన్ను బిల్చుటలేదు నిజమునమ్మ
భారతస్త్రీలకు పతియె దైవంబన
నితరదైనములేల యెంచిచూడ
తండ్రిగానినుబిల్తు దైవముగాగాదు
తనయగా నన్నెంచి తరలిరమ్మ
మాప్రజల్ తప్పులు మదినెంచినిలువకు
అందరిశిక్షనే ననుభవింతు

తే॥గీ॥ నిన్నుజూచిన మీదట నెంతపాపు
లైన పావనులౌదురు శ్రీనివాస
రమ్మ రమ్మయ్య మణిమంది రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ పంతమేల. 86

సీ॥ పిలిచిన రాకున్న చులకనగానెంత్రు
నాదేశవాసులు నన్నుజూచి
ఇంతధైర్యముగాను నింతినన్ బిల్చుట
కవితవ్రాయుటకంచు కథలుచెప్పి
గుసగుస లాడంగ పసచెడినామది
పరిపరివిధముల బాధచెందు

నమ్మినమనసును ⸙ నసబెట్టజూచిన
సృష్టికేనష్టంబు ⸙ చిత్రరూప

తే॥గీ॥ బాల్యమాదిగ తెలియక ⸙ పట్టుబడని
నిన్నెనమ్మితి కష్టాల ⸙ నెన్నొబడితి
రమ్ము రమ్మయ్య మణిమంది ⸙ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ⸙ పంతమేల. 87

సీ॥ సానబట్టినగాని ⸙ చక్కనిదైనను
వజ్రంబునకునెట్లు ⸙ వన్నెవచ్చు
శాశ్వత కీర్తిని ⸙ విశ్వమందుననుంచి
యేకోటి కొకరినో ⸙ యెంచినీవు
ముప్పతిప్పలుబెట్టి ⸙ గొప్పనుదెత్తువు
నీకున్న గుణమది ⸙ నాకు తెలిసె
చిన్నతనమునుండి ⸙ కన్నుంచినావిూద
కక్షకడితివయ్య ⸙ కపటముగను

తే॥గీ॥ వింతరూపాల జాల్చేడు ⸙ విష్ణువీవు
నలతబెట్టంగ మాయను ⸙ నంపితౌర
రమ్ము రమ్మయ్య మణిమంది ⸙ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ⸙ పంతమేల. 88

సీ॥ తెలిసికొంటిని నిన్ను ⸙ తెలివిలేకున్నను
పడతినైనను నేను ⸙ జడియనింక

బాలికగానుండి ॥ బాల్యంబునందున
నేననుకొంటిని ॥ నేర్పుగాను
ఆహిమగిరికేగి ॥ యందుతపముచేయ
భాగనియెంచెనా ॥ జోగిమనసు
స్త్రీనాటచే నేను ॥ సిరిసంతతుల్‌గల
సంసారగుహలోన ॥ సతిగ మెలగి

తే॥గీ॥ సల్పియుంటిని సత్కర్మ ॥ శాంతముగను
ముక్కుమూసియుఁ గూర్చుండ ॥ నెక్కువౌన
రమ్ము రమ్మయ్య మణిమంది ॥ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ॥ పంతమేల. 89

సీ॥ మజ్జిగలోవెన్న ॥ మరియంటనట్లుగా
సంసారమందున్న ॥ సతిని నేను
కట్టెలోనగ్నియు ॥ కండ్లకందనిరీతి
తపమునమున్నట్టి ॥ తన్వినేను
కష్టంబుసుఖమును ॥ నిష్టంబుగానెంచి
కాలంబుగడపిన ॥ కాంత నేను
నాల్గుగోడలమధ్య ॥ నన్యంబునెరుఁగక
నిన్నె నమ్మిన యట్టి ॥ నెలత నేను

తే॥గీ॥ నీకుచెప్పెడిదేమిటి ॥ నిఖిలమెఱిఁగి
సర్వజీవులఁబ్రోచెడు ॥ సత్యరూప

రమ్ము రమ్మయ్య మణిమంది ǂ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ǂ పంతమేల. 90

సీ॥ భారతదేశాన ǂ భాగ్యవంతులునుండ
బరువైన బిరుదుల ǂ బంటులుండ
వేలకువేలుగా ǂ వేదవేత్తలునుండ
పండితశ్రేష్ఠులు ǂ పదుగురుండ
సర్వజ్ఞులయినట్టి ǂ సఖియలెందరోయుండ
నిందరందునకొద్ది ǂ యింతినైన
నాయింటబసచేయ ǂ నీయంటివానికి
చిన్నతనంబయ్య ǂ చెప్పునీవు

తే॥గీ॥ గర్వమించుకలేనట్టి ǂ ఘనుడవైన
భక్తిధనముకు లొంగెడు ǂ బంధువైన
రమ్ము రమ్మయ్య మణిమంది ǂ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ǂ పంతమేల. 91

సీ॥ ఆకలియనిబిల్వ ǂ దాకొందు వేలయా
లోకపోషకకీర్తి ǂ నీకుతగదు
నీసతీమణియిచ్చు ǂ నిండైనబియ్యంబు
నాయాకలణచదు ǂ నమ్మునీవు
దాహంబు మెండాయె ǂ ధరనున్నజలమంత
త్రాగిన దప్పిక ǂ తరుగదాయె

నమ్మునీరాకచే ఽ నాయాకలడగును
సంశయంబులుదీర్చి ఽ చక్కనైన
జ్ఞానామృతంబను ఽ పానకంబునునిచ్చి
దాహంబుతీర్చుమా ఽ తత్‌క్షణంబె

తే॥గీ॥ ఎట్టియాహారమైనను ఽ పొట్టనింపు
ఆత్మనిండునుపరమాత్మ ఽ నందుకొనిన
రమ్మ రమ్మయ్య మణిమంది ఽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 92

సీ॥ ఎన్నెన్నొబిరుదుల ఽ వన్నెకాడవునీవు
అతివనెఁ నాయాక ఽ లణఁచవేని
నీబిడ్డచేసెడు ఽ నింద్యైన సృష్టిని
మ్రింగివైచెదనేమొ ఽ తొంగిచూడు
ధరలోన ప్రవహించు ఽ ధన్యగంగనునాపి
త్రాగివైచెదనేమొ ఽ తరలిరమ్మ
కోపంబునెఱుఁగని ఽ కోమలాంగినినన్ను
రెచ్చకొట్టకు మింక ఽ పిచ్చివాఁడ

తే॥గీ॥ ముసుగుతొలగించిరమ్మింక ఽ విసుగుగలిగె
కట్టివేసితి నీమాయ ఽ కట్టిపెట్టు
రమ్మ రమ్మయ్య మణిమంది ఽ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ఽ పంతమేల. 93

సీ॥ దొంగవునీవను ƒ బంగరుపల్కులు
నేటికర్థములాయె ƒ తేటగాను
నిన్ను నమ్మినప్రాణి ƒ మిన్నగానెంచెదు
నిష్టార్థమంతయు ƒ నష్టపఱచి
దోఁచివేతువుగదా ƒ దొంగలాగుననీవు
నినునమ్ముటే గొప్ప ƒ నేరమందు
జరిగినదానికి ƒ జగడంబులేలయా
మఱిమఱిదెప్పెదు ƒ మగువగాను

తే॥గీ॥ ఇవియుమనసుననిడుకొని ƒ యింటికరుగ
తన్విమన్నలేదని ƒ తలఁచవలదు
రమ్ము రమ్మయ్య మణిమంది ƒ రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ ƒ పంతమేల. 94

సీ॥ చెప్పుమరచితయ్య ƒ గొప్పవిషయముండె
మణిమందిరము వ్రాయ ƒ మనసునందు
కోర్కెగల్గిన నాడు ƒ కొమ్మయెవరొవచ్చి
కలలోన వింతైన ƒ కాంతిబోలు
చంటిబిడ్డనునాకు ƒ చనవుగా నందీయ
చేతదీసుక నేను ƒ కౌతుకముగ
నాగుండెకద్దుచు ƒ నాతినంకనుజూడ
బాలునిసైగతో ƒ భామజూడ

తే॥గీ॥ బాలుడప్పుడుశ్లోకాల ‡ పాడెనీదు
లీలలన్నియు నెఱిగితి ‡ గోలనయ్యె
రమ్ము రమ్మయ్య మణిమంది ‡ రానికనిన
పలుక వేలయ్య పరమాత్మ ‡ పంతమేల. 95

సీ॥ అందున్న భావంబు ‡ లన్నియునెఱిగితి
పరవశంబయ్యెను ‡ భావమందు
ప్రక్కకు తిరుగంగ ‡ పడతిగానఁగరాదు
నిన్నెర పడినేను ‡ దన్నునందు
మంచంబుమీదికి ‡ దించియుపాపను
ప్రక్కనుపడుకొని ‡ పాలునిచ్చి
నిదురబుచ్చినమీద ‡ నిదురఁబోతిని నేను
దానియర్థముచెప్పు ‡ దాచకుండ

తే॥గీ॥ చిత్రలీలలు భారత ‡ స్త్రీలకిట్లు
చూపుచుందువ యందఱు ‡ చోద్యమొంద
రమ్ము రమ్మయ్య మణిమంది ‡ రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ ‡ పంతమేల. 96

సీ॥ పలుకవుపిలువఁ నీ ‡ పాలనంబేలయ్యె
నిండైన బిరుదుల ‡ చెండుగట్టి
పాలసంద్రమునందు ‡ పారవేయుమునీవు
శంఖచక్రగదల ‡ చక్కవీడి

గరుడునివదలుము – గగనంబులోనికి
నాగరాజునుపీడ – న్యాయమౌను
వేగంబె దిగుమయ్య – విలువైననీసీటు
మంచివారేలంగ – మించిపోరు

తే॥గీ॥ లేనిగొప్పలుపొగడెదు – లేమగాను
నున్నదంటివిని నలుకేల – నులుకదేల
రమ్ము రమ్మయ్య మణిమంది – రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ – పంతమేల. 97

సీ॥ గడచినజన్మల – కర్మలన్నియుఁగల్పి
నూరేండ్ల వారొందు – యొద్దునిచ్చి
ముప్పదేడులపైగ – తిప్పలుఁబెడితివి
నిలుపుము చాలించు – తులవతనము
మాకవుల్ మాటలు – మదికివచ్చెను నేడు
కృష్ణావతారంబు – కిటుకు తెలిసె
పొగడుచుండిన నిన్ను – పొంగిపోవుచునీవు
రక్షింపబూనెదు – రాజువనుచు

తే॥గీ॥ తెలిసికొనియును నేవట్టి – తెలివితోడ
పిలువజాలంగనేరని – కలికి నేను
రమ్ము రమ్మయ్య మణిమంది – రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ – పంతమేల. 98

సీ॥ విసిగియుండుటచేత  కసరుకొంటినిగాని
భక్తినీపైలేని  భామగాను
ఏమేమి యంటినో  యెంచి కోపించక
మన్నించియపియన్ని  మరచిపొమ్మా
దేవనేగంటిని  దేవకాంతలునన్ను
మారురూపంబుల  మాయఁజేయ
నాయింటిచుట్టును  నటనగాదిరిగియు
దొరికిపోయిరిసుమ్మ  పరువుపోగ

తే॥గీ॥ క్రొత్తలేదయ్య సిరికిఁ నీ  కోడలికిని
వారితోఁగూడనీరాక  వన్నెకెక్కు
రమ్ము రమ్మయ్య మణిమంది  రాని కనిన
పలుకవేలయ్య పరమాత్మ  పంతమేల. 92

సీ॥ మత్స్యావతారుఁడా  మర్యాదఁజేసెద
కూర్మావతారనిన్  కొలుతునెపుడు
వరహావతారుఁడా  వరములనీవయ్య
నరసింహనీకిదె  నతులఁజేతు
వామనరూపుఁడా  వందనంబులునీకు
రామావతారుఁడా  రమ్మురమ్ము
పరశురాముఁడనీకు  ప్రణతుల నర్పింతు
బలరామకృష్ణాఖ్య  భక్తిఁజేతు

బుద్ధావతారుఁడా § బోధ చేయుము నాకు
కల్క్యవతారుఁడా § కావరమ్మ
తే॥గీ॥ శ్రీమహావిష్ణురావయ్య § శీఘ్రముగను
మగువమణియమ్మ పిలుపిది § మానమేల
రమ్మ రమ్మయ్య మణిమంది § రాని కనిన
పలుక వేలయ్య పరమాత్మ § పంత మేల. 100

## ఫలశ్రుతి

సీ॥ ఎనుబదిపద్యాల § నెలమి వ్రాసియు నేను
పుస్తకంబును నెట్లు § పూర్తిఁ జేతు
ననుచు దలఁచుచుండ § నారాత్రియందున
నిదుర బోతిని మది § కుదురు లేక
వనిత యొక్కతె వచ్చి § వ్రాసిన నాపొత్త
మెత్తుచు కలముతో § మెల్లగాను
వ్రాయుచుండిన నేను § వనితతో నిట్లంటి
నాపుస్తకంబందు § నాతి నీవు
తప్పులు వ్రాసెదు § తరువాత నేదాని
దిద్దలేననుచును § పెద్దగాను
తే॥గీ॥ కసిరి నే పల్క హాసంబు § కనులఁ దోప
పడఁతి పండితురాలవై § పరగితీవు
నేను వ్రాయంగ నచ్చునా § నీకు ననుచు
చిన్న నగవున నన్ గేలి § చేసె నామె 101

తే॥గీ॥ అట్టిభారతి యమృతపు హాస రేఖ
భక్తినిగ్రంథపాఠక ప్రజలయందు
నిల్చివిద్దెలయందున నేర్పునిచ్చి
ప్రోచుచుండును సతతంబు పొలుపుమీర 102

కం॥ మణిపూర్వపు తపముననే
మణిబాహ్యపు దృష్టియందె మాధవుగాంచెన్
మణిమనసు మందమెఱిగియె
మణియమ్మకు కాళిమాత మాటలునేర్పెన్ 103

కం॥ మణులనునిటికెలవాణియె
మణియమ్మకు నాకునీయ మక్కువతోడన్
మణిమందిరంబు కట్టితి
మణిగొప్పనుపొగడకండి మఱిమఱి మీరల్ 104

కం॥ మణిమందిరంబు చదివిన
మణిమందిర మందునున్న మర్మముగనినన్
మణిమందిర వాసుండగు
ఫణిశయనుండు మీకునిచ్చు పలుభోగములన్ 105

కృష్ణార్పణమస్తు

సంపూర్ణము

| పేజి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 10 | చెతపైచి | చేతపైచి |
| 12 | జర్చెజెప్పి | జెర్చిచెప్పి |
| 19 | నా తంత్రి | నాతండె |
| 24 | నవారగా | నవారిగా |
| 28 | ఎట్లు | ఎట్టు |
| 28 | ఘనుడపు | ఘనుడవు |
| 31 | గూ్రించు | గూంర్రించు |
| 35 | నేనేంత | నేనెంత |
| 37 | చూవులే | రూపులే |
| 53 | యుకుంసు | యుండును |
| 54 | అయహంకారం | ఆయహంకారం |
| 55 | నిదుంపె | నిదుండ్డె |
| 58 | నగినెను | నరిగినేను |
| 67 | కష్టంబు | కష్టంబు |
| 75 | పరువులెచె | పరువులేచ |

# మణియమ్మగారి గ్రంథములు

| | | |
|---|---|---|
| తుమ్మెద సందేశము | ద్విపద | 0—3—0 |
| నివేదిక | పద్యరచన | 0—2—0 |
| మణి భావమణులు | పద్యకావ్యము | 0—8—0 |
| మణి మందిరము | పద్యకావ్యము | 1—0—0 |
| ,, క్యాలికోబైండు | ,, | 1—8—0 |

రాబోవు గ్రంథము— మణిమాలలు

అడ్రస్సు :

యస్. మణిరామచంద్రరావుగారు

గూడూరు నెల్లూరుజిల్లా

లేక

T. వీరభద్రరావుగారు. V. M. రాజమండ్రి.